సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ






సంపుటము 4[illegible]
సంచిక 29
31.3.54

# సచిత్రవారపత్రిక

Founder K NAGESWARA RAO

విజయ ఫాల్గున బహుళ ఏకాదశి బుధవారం



"వా కౌ ట్"

ఫొటో. సాళం రామేశ్వర్రావు, రాజమండ్రి.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:—క్రొత్త సినీతార
'లీలారాణి'



## గమనిక

పై వారం ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక ప్రత్యేకాకర్షణలతో వెలువడుతున్నది. రియల్ ఆర్ట్‌పేపర్ పైన "వసంతాగమనం" అను చక్కని త్రివర్ణముఖచిత్రంతో, ఇతర చిత్రాలతో వారపత్రిక ప్రచురించ బడుతున్నది. శ్రీ 'శారద'గారి నవల "మంచీ చెడూ" పై వారమే ప్రారంభమౌతుంది.

—సంపాదకుడు.




"పలుకులు పల్కుమాట లోకభంగి
సహించితి; బావ్వవారి లో
పలసె హరించి, శూన్యమగు
భావమునన్ వెడనవ్వు నవ్వితిన్;
బొలుపటి విత్తజాడ్య హతబుద్ధుల
కంజలి చేసితిం; గటా!
తలకక యింక నేపనికి
దార్చెదు నన్ను దురాశ నీవిటన్?"

తా॥ నీచులు పలికెడి మాటలను ఒక విధంగా ఓర్చుకున్నాను-కన్నీళ్ళను లోలోపలనే హరించేటట్లు చేసితిని మనస్సులో సంతోషం శూన్యమైనప్పటికీ, దొంగ నవ్వును నవ్వితిని. ధనగర్వమనెడి జాడ్యముచే పీడింపబడిన బుద్ధిగలవారికి దీనుడనై చేతులను జోడించి నమస్కరించితిని. అకటా! ఓ దురాశా! నన్ను విడిచిపెట్టక యిటుపైన ఇంకను ఏ పనికి నన్ను యీడ్చుకొని పోయెదవో గదా!

దురాశ అనేది ఒకటి ఉన్నప్పుడు, అది దుఃఖముచేటు అంటారు. అది దుఃఖ కారణము అనే సంగతి అంత్యదశలో తమ అంత్య సందేశంగా అనుభవజ్ఞులు అనేకులు లోకానికి వెల్లడించారు.

"స్వానుభవమిది తెల్పుచున్నానువినుడు
సానియిండ్లకు బోకుడీ - సరసులార!"

అని చింతామణికి అంతా సమర్పించి ఐ. పి. దాఖలు చేసిన తర్వాత సుబ్బిశెట్టి తన గీత ఏవిధంగా విరించి లిఖించినాడో గ్రహించి, లోకానికి పై గీతపద్యంలో "స్వానుభవమిది తెల్పుచున్నాను వినుడు" అని వేశ్యాగోష్ఠిలో పడిన వైశ్యశ్రేష్ఠి తన వారకాంతా భాగవతం అంతా అయినతర్వాత, భ్రమ తీరినతర్వాత పాడిన భ్రమరగీతలులాగున శ్రవణానందంగా "ధనమా పోవును; మానమా చెడును; నిందా నెత్తిపైకెక్కు" అని ఆలాపన చేశాడు: భోగం అనుభవించవలెననే ఆశఉన్నవాడు సుబ్బిశెట్టి ఒక్కడేకాడు. మహాపండితుడైన బిల్వమంగళుడు కూడా చింతామణికి ఆత్మార్పణం చేసి దాసోహం అన్నాడు చిటచివరకు "చింతామణిర్జయతు! సోమగిరిర్గురుర్మే-శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛమౌళిః" అని తన కృష్ణ కర్ణామృతం కూడా ఆమెకే అర్పితం అన్నాడు.

"నాకు మంచి గురువును చూపించిన చింతామణికి జయమగుగాక! నాకు గురువై గోపాల మంత్రము నుపదేశించిన సోమగిరికి జయమగుగాక! నాకు మంచి నడవడికనిచ్చి నన్ను క్రమ శిక్షణలోనికి తెచ్చిన భగవానునకు, అనగా తలలో తురాయివలె నెమలి పింఛమును దాల్చిన శ్రీకృష్ణునకు జయమగుగాక!"

చింతామణికి జై! అనే శ్లోకంతో ఉపక్రమించాడు. భోగం కావాలంటే అది భోగం వీధిలోనే లభిస్తుందని వాదించిన వాళ్ళెందరూ, ఆ విషయమై శోధించి, ఆ వాదన అబద్ధమని ఆఖరుకు అఖిలలోకానికి బోధించారు. మొదట భ్రమలో పడ్డామనిన్నీ, కోతులవలె తిరిగి గోతులలో పడినామనిన్నీ, నీతులు చెప్పినవారే పునీతులు. మొదట్లో మనము వానరులమే అని ఇంగ్లాండులో వెలసిన డార్విను పండితుని సిద్ధాంతము. కాని కాలక్రమేణ వానరులు నరులు అయినారని వాదించుకుటకు అఖండ ప్రజ్ఞ అక్కరలేదు. "వానర" శబ్దంలోని "వా" దించివేస్తే చాలు. "వానర" శబ్దం "నర" శబ్దం అవుతుంది. డార్విను చెప్పిన పరిణామ సిద్ధాంతంలో ఉన్న సత్య పరిమాణ ప్రమాణం ఆ శబ్ద పరిణామంలోనే ఉంది. అయితే ఒక్క విషయం ఉంది. భోగభాగ్యా అనుభవించలేనివారికి, నేటి వైద్యులు అనగా (నేటి నేటివ్ వైద్యులు కాదు) నేటి ఇంగ్లీషు వైద్యులు మర్కటముల గ్రంథుల లోని పదార్థమును మనుష్యుల శరీరంలోనికి సూదులద్వారా ఎక్కించవలెనని నొక్కివక్కాణించుచున్నారు. దీనినిబట్టి చూస్తే నరుల శరీరతత్వం తిరిగి వానరతత్వంలోనికి వచ్చుటవల్లనే నరతత్వం పరిపక్వం కాగలదనిన్నీ, మానవుడు దేవేంద్రభోగం అనుభ

వించగలడనిన్నీ నిశ్చయించి, డార్విను సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేసి తారుమారు చేసినట్లవుతోంది.

ఏమైనప్పటికీ, దురాశ అనేది ఎక్కడ ప్రారంభమైనదని పరిశీలిస్తే భోగంవీధిలోనే ప్రారంభమైంది. భోగం విషయంలో దురాశ లేకపోతే, భాగ్యం విషయంలో దురాశ లవలేశం ఉండదు రంభ, మేనక, ఊర్వశి, ఘృతాచి, తిలోత్తమ మొదలైన మదవతుల విలాసాల ఖులాసాలతో ప్రారంభమైనదే దేవేంద్ర భోగం. కాని, ఆర్యపుత్రా! ఆ దేవేంద్రలోకంలో ఈ "రంభా అండుకో" లేదనుకో- అప్పుడు అప్సరస్సలు లేని దేవేంద్రలోకం దీపాలు లేని దేవిడీ లాగున పాడుపడినట్లుంటుంది అప్పుడు ఇంద్రలోకం చాలా భాగం ఖాళీ అవుతుంది ఖిళ్ళీ దుకాణాలన్నీ ఎత్తివేస్తారు సిల్కు చీరెల షాపులు, జడ రిబ్బను షాపులు, ఫేస్ పౌడర్ల షాపులు, నగలు మొదలగు సకల సుభగంకరణ వణిజ వ్యాపారము దారము తెగిన హారమువలె అంతర్ధానమగును బంగారమువంటి శెట్టి సంగీతమువల్ల చెడిపోవుననేమాట అబద్ధము సంగీత సాహిత్య భరతనాట్యాభినయమయమైన యింద్రసభలో ఎందరో ఇందువదనలు, కుందరదనలు, మందగమనలు, అందకత్తెలు ఆడుతూ పాడుతూ ఉండడంవల్లనే అక్కడ దేవేంద్ర భవనాలు, మరువం దవనాలుగల ఉద్యానవనాలు, వాటిని అనుభవించే స్త్రీ పురుషుల నిత్యయౌవనాలు, యింద్రుడందుకై ఆరగించే యజ్ఞహవిర్భాగాల కొరకైన సవనాలు, ఇంద్రుని సామ్రాజ్యాధికారం క్రింద ఉండే భువనాలు, ఇవన్నీ అనుపానాలుగా అమరి ఉండాలి అటువంటిచోట బంగారు వర్తకులకు బేరం సాగినట్లుగా యింకొకచోట సాగదు కనుక "బదిగారమువంటి సెట్టికి సంగీతమువల్ల బేరసారము లుడిగెన్" అనే మాట అబద్ధము. అటువంటి సంగీత గోష్ఠి ఎక్కువైనప్పుడే బంగారంవంటి శెట్టి మరింత బాగుపడతాడు బంగారయ్యశెట్టి నిజంగా బంగారుసెట్టి అవుతాడు ఈ విషయమునే ఆర్థిక శాస్త్రసూత్రంగా ఒక్కముక్కలో చెప్పవలెనంటే, ప్రజల జీవితానుభవం హెచ్చినప్పుడే ప్రజల కొనుగోలు శక్తి వృద్ధియై, దేశం ధనకోశం అవుతుంది. కాని, దేశసంపద వృద్ధియైనప్పుడే ప్రజలకొనుబడి వృద్ధియై ప్రజల జీవిత సౌఖ్యానుభవం వృద్ధిఅవుతుంది ప్రజలు భోగించి జీవితసౌఖ్యాలు అనుభవించితే, నాణెములు బాగా చలామణీయై, రవాణా వ్యాపారం వృద్ధియై, దేశసంపద వృద్ధిఅవుతుంది. కనుక ప్రజలు భోగించినకొద్దీ ప్రజల భాగ్యం వృద్ధిఅవుతుంది భోగ్యాభివృద్ధివల్లనే భాగ్యాభివృద్ధి కలుగుతుంది ఈవిధంగా కామశాస్త్రంతో అర్థశాస్త్రం అర్ధాంగిగా అతికింపబడింది ఇది యీ లోకంలో యీ కాలంలో ఇంగ్లీషు చదువువల్ల మనకు ఎరుకపడిన సరిక్రొత్త విషయము.

కాబట్టి, భోగాపేక్ష ఎంత వృద్ధిఅయితే అంత మంచిది. కనుక దురాశ అనేది దూషించదగినది కాదని దూరం ఆలోచించిన పిమ్మట, దూరదేశాలలోని పండితులు ఖండితంగా, శంఖం ఊదినట్లుగా, కూలీలను నిద్రలేపి పనిలోకి పిలచుటకై ఫ్యాక్టరీ కూత కూసినట్లుగా ప్రబోధించి బోధించుచున్నారు. నిజమే - వారి ఆర్థికశాస్త్ర ఘోష అంతా ఆ ఫ్యాక్టరీలలోనుంచియే వస్తోంది వారి దేశాలలో మిల్లులు ఆడితేనే పొయ్యిలో పిల్లి లేస్తుంది మిల్లులు బాగా పనిచేస్తే, భారీగా సరకు ఉత్పత్తి అయితే, ఆ సరకు భారీగా రవాణాఅయితే, ఆ సరకు దుకాణాలలో అమ్మకమైతే, ప్రజలు కొనుక్కొని అనుభవిస్తే, అదే మిల్లుకూ, అదే మిల్లు ఆసామీకీ, పదివేలు తన సరకు కొన్న వారందరికీ వేనవేలు జేజేలు.

పదిమందీ తన సరకులను సరదాగా కొనుక్కొని కడుపునిండా తినాలి, త్రాగాలి, విలువగల జిలుగువలువల దుస్తుముస్తాబుతో రాజారాణిలాగున కేళీవిలాసంగా రాసక్రీడ చేయ్యాలి హాయిగా అనుభవించాలి పదిమంది మేలు కోరిన మిల్లు ఖామందు కోరేది అది విశ్వశ్రేయమే మిల్లు ఆసామీ ఆశయం. "విశ్వశ్రేయః కావ్యం" అని సాహిత్యానికి ఒక లక్ష్యం పూర్వులు నిర్వచించారు ఏ గొప్ప కావ్యం రచించినా, ఏఉద్దేశంతో రచించవలెనంటే, లోకముయొక్క శ్రేయస్సు కోరి రచించాలి. మహాపురాణాలు రచించిన మహాత్ముల ఉద్దేశం అదే మహాప్రబంధాలు కూడా అటువంటివే అన్నారు. ప్రబంధాల లక్ష్యమే ఫ్యాక్టరీల లక్ష్యం.

కాని, ప్రబంధాల కవిత్వంలో అబద్ధాలు ఉన్నాయంటారు ప్రబంధాలు ప్రభువుల సరదాకోసం వ్రాయబడినవంటారు ప్రబంధాల మూలంగా శృంగార భోగలాలసత్వం ఎక్కువైనదంటారు ఆధునిక యువకవిమర్శకులు. కాని, ఆధునిక నవనాగరిక ఫ్యాక్టరీల మాట ఏమిటి? వాటికి కూడా లక్ష్యం విశ్వశ్రేయమే.

కాని, ఆమాట అబద్ధమని కుటీర పరిశ్రమవాదులును, యంత్ర విముఖ యతీంద్రులునగు మహాత్ములు వాదించారు. ఫ్యాక్టరీలు విశ్వశ్రేయ మార్గం కాదన్నారు హింసకూ అసత్యానికీ సామ్రాజ్య కాంక్షకూ మార్గం అన్నారు. ఫ్యాక్టరీ అనేది ధనికుల కులవర్ధని అన్నారు. ఫ్యాక్టరీల మూలంగా నగర శృంగారములో భోగ విలాసం అధికభాగం అయి, నగరం రోగ సాగరం అయింది. ఫ్యాక్టరీల ఖామందులందిచ్చిన మల్లెపూలవంటి తెల్ల బియ్యంతో వయసు పసుపులు వడుమువంచి దంచని తెల్లని వరిబియ్యంతో, మన తనువులు తెల్లవారుచున్నవి. రక్తపుష్టిలేని రిక్త జీవితములగుచున్నవి ప్రజలు అప్రతిమాన ప్లాస్టిక్కు సంతాన ప్రతిమలగుచున్నారు. ప్రజలు పాండువు ప్రబలమైన పాండవులై, పేరుకు భారతవీరులమని చెప్పకొనుచున్నారే గాని పురుషులు గాండీవమెత్తలేరు స్త్రీలు గుండిగలతో వండి వార్చలేరు.

కనుక, "మాధవా! మన రథంబు మరలనిమ్ము" అన్నవాడే మహాత్ముడు చక్రం వెనుకకు త్రిప్పవలెనన్నాడు. *Back to the Village* (పల్లెటూళ్ళకు మళ్లి వెళ్లండి) అనే మంత్రం మహాత్ముడు బోధించాడు. "బ్రతికియుండిన భాగ్యముల్ బడయవచ్చు" అనే మాట నిజం. శరీరదార్ఢ్యం సరిగ్గా ఉంటేగదా సరదాగా అనుభవించేది? ఏళ్లైనంతవరకూ బస్తీ విడిస్తే ఒంట్లో సుస్తీ పోయి మనుష్యులు కట్టుమస్తీగా ఉంటారన్నాడు. ఢిల్లీకంటె పల్లె మంచిదని బోధించాడు. కాని—

భారతదేశంలో సగటు ఆదాయం దినమునకు మనిషికి అణాముక్కాని ఇదే మన ప్రవర్తనకు చుక్కాని అని మహాత్ముడు మన ప్రజానీకానికి మనవి చేశాడు. దేశ దారిద్ర్యం తొలగించాలంటే, దేశ దాస్యం పోవాలన్నాడు. బుద్ధిదాస్యంపోవాలన్నాడు. "పలువలు పల్కుమాట లొకభంగి సహిం"చుట ఎందుకు? తెల్లదొరలకు పాద పూజలు చేస్తే, మనకు కడుపులో నీళ్లు కదలకుండా కాలం గడచిపోతుందనే బుద్ధి దారిద్ర్యమే కత్తిలేని శుద్ధదారిద్ర్యం అన్నాడు. పరులకు లొంగి మన ఆత్మగౌరవమును ఏలమువేసి వంగి సలాములుచేస్తే మన పాలు పొంగవు ప్రభువుల కొంగుతగిలితే చాలునని పొంగిపోయెడి వెర్రి వెంగళప్పలనే కీలుబొమ్మలజేసి, బ్రిటిష్ జెండాకూ జయ్! అనిపించారు జైజైలు అన్న వారిచేతనే మన నాయకులను జైళ్లలో పెట్టించారు. కాంగ్రెసు నాయకులను చెరసాలల్లో కొరడాలతో కొట్టిన దెబ్బలు కట్టుదిట్టమైన క్రమశిక్షణయని మెచ్చి మన దొరలకు కితాబులిచ్చిన మన సోదరులే ఆనాటి వైశ్య గౌరవ ప్రేక్షకులు.

సామ్రాజ్య కాంక్షచేత సాహుకారులై సాధువులను హింసించెడి సర్కారుతో సహకరించముఅని ప్రకటించ

# ★ కాలక్షేపం ★

గల్గిన సాహసుడు మహాత్ముడు. సర్వసంగపరిత్యాగికే ఆ సాహస సత్యాగ్రహము సుసాధ్యమైనది. కపాలమాలియై స్మశాన వాటికల సంచరింపగల్గిన ఆదిభిక్షువునకే శివంకరమైనరౌద్రము. ఈశ్వరునకు మించిన అయిశ్వర్యవంతుడులేడు. ఆశలేనివాడు ఈశుడు ఇదే మనదేశంలో మహాత్ములు బోధించిన అయిశ్వర్యవాదం. ఆవిధంగా విమర్శిస్తే పాశ్చాత్య ఆర్థికవాదము నిరీశ్వర వాదం అవుతుంది

మత్తెక్కిన వానిది మత్తేభం అంతబలం విత్తంకూడా మత్తుపదార్థం వంటిదే కనుక విత్తమువల్ల చిత్తము చలించగలదు కాని చిత్తచాంచల్యం కల్గినప్పుడువిత్తచాంచల్యం ఏర్పడుతుంది. "చంచల" అనేది లక్ష్మికి మన పెద్దలుచేసిన నామకరణం దాని తత్వం చంచలత్వం అన్నారు అది ఎక్కడచేరితే అక్కడ దానికి స్థిరత్వం ఉండకూడదు చలామణీ ఉండితీరాలి ద్రవ్యానికి దేహంలోనిరక్తం నెత్తురుగోట్రాలలో ఎప్పడూ తిరుగుతూ ఉండాలి ఆవిధంగా తిరుగకపోతే అది ఒక జాడ్యం ఆ జాడ్యం ప్రాణానికి మోసం.

విత్తంకూడా ఒక్కచోట మిక్కుటమై స్తంభించకూడదు. అదే విత్తజాడ్యం కోటీశ్వరుల కొరీలలో ద్రవ్యం నిల్వఉంటే, అది అక్కడ మూల్గుతూ ఉన్నదని చెప్పక తప్పదు దేశంలో ద్రవ్యం మూల్గుతూ ఉన్నప్పుడు ప్రజలుకూడా మూలుగుతూ నీలుగుతూ ఉండక తప్పదు ఒక వర్గానికి దురాశ ఇంకోవర్గానికి నిరాశ ఏదో ఒకటి ప్రబలం కావాలి నిరాశ నిస్సంగత్వంలోకి పరిణమిస్తుంది నిస్సంగుడు నిరంకుశు డవుతాడు.

"ఇప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్ హాలికులైన నేమి?" అని "కర్ణాట కిరాత కీచకులకు" తన భాగవతం అంకితంయివ్వనని, పేదరైతుగా జీవిస్తానని, శపథంచేసిన పోతన్న తిరుగుబాటు చేశాడు. ఆయన వాగిలికి ఎద్దులుకూడా లేకుండా పొలం దున్నిన దినాలున్నాయి ఆ పేదరైతు వ్రాసినది బీదకవిత్వం కాదు. ఆయనకు సాక్షాత్కరించిన స్వామి కూడా లక్ష్మిని లెక్క చెయ్యలేదు. లోకసంగ్రహార్థం ఏకైకదీక్షతో ఉండే భగవంతుడు "సిరికిం జెప్పడు" – బుజంమీద ఉత్తరీయం ఉన్నదా లేదా అని చూచుకోడు తన ఉద్యమానికి తగిన ద్రవ్యాధారం ఉన్నదా లేదా అని కూడా చూచుకోకుండా ఉద్యమం ప్రారంభిస్తాడు. "హరి వెంటన్ సిరి" అదేవస్తుంది, ఆవు వెంట దూడవచ్చినట్లు. అంతేకాదు వైకుంఠపురం అంతా తరలివస్తుంది ఆనమ్మకంతో, ఆత్మ విశ్వాసంతో, ఆర్తనాదం వినగానే హాజరు కావడం హరిలక్షణమే కాదు హరిభక్తుల లక్షణం, హరిజననాయకుని లక్షణం.

అటువంటి పోతన్నకు అగ్రహారామిస్తే మాత్రం "కర్ణాట కిరాత కీచకులమీద ఆగ్రహం పోతన్నకు పోతుందా! ఆయన ఒకప్పుడు భోగినీ దండకం రచించాడంటారు అది నిజమైతే, ఆ భాగవతం అంతా అయిన తర్వాతనే ఆంధ్ర భాగవతం ఆయన రచించినాడని వచింపక తప్పదు

కాకతీయ సామ్రాట్టులవద్ద సేనాధిపతులుగా వెలసిన వెలమ వీరులు రెడ్డివీరులు స్వతంత్ర రాజులైనారు. కాకతీయ సామ్రాజ్యాన్ని ఆ ప్రతాపరుద్రుడు, ఆ రుద్రమదేవి అఖండవైభవంగా ఓరుగల్లును ముఖ్యనగరంగా చేసికొని పరిపాలించిన పిమ్మట, యీ పద్మనాయక వీరులూ, (వెలమవీరులు), రెడ్డిరాజులూ చిన్నచిన్న స్వతంత్రరాజులైనారు. కొండవీడు, రాజమహేంద్రవరం ప్రాంతాలలో రెడ్డిరాజులు పాలించారు నేటి నైజాంరాష్ట్రంలో చేరిన రాచకొండ పరగణాను దేవరకొండ పరగణాను వెలమ (పద్మనాయక) ప్రభువులు పరిపాలించారు రాచకొండ పరగణాను రేచెర్లవంశపు వెలమప్రభువులు పాలించారు హంపివద్ద ఏర్పడిన ఆనాటి విజయనగర రాజ్యంకూడా వృద్ధిలోకి వస్తోంది వారందరూ ఆనాటి కర్ణాటరాజులు. విజయనగర రాజ్యానికీ, రాచకొండ సంస్థానానికీ మధ్య కృష్ణానది హద్దుగా ఉండేది రాచకొండ రాజ్యాధిపతులైన రేచెర్ల వెలమవంశములో అనపోత నాయడను మహీపతి ఉండేవాడు. అతని అనంతరము అతని కుమారుడైన రెండవ సింగమనాయకుడు క్రీ॥ శ॥ 1384-1399 మధ్య కాలములో పరిపాలించెను ఇతడు మహారసికుడు సంస్కృతపండితుడు ఈ రెండవ సింగ భూపాలునకు "సర్వజ్ఞుడు" అనే బిరుదు ఉండేది ఇతడు "రసార్ణవ సుధాకరం" అనే అలంకార గ్రంథమును రచించాడు. ఇతని ఆస్థానంలో విశ్వేశ్వరుడు, అప్పయార్యుడు అనే గొప్ప విద్వాంసులు ఉండేవారు ఈ రేచర్ల వెలమనాయకునిచే పోషింపబడిన సంస్కృత విద్వాంసులెందరో ఉన్నారు సకలశాస్త్రపారంగతుడని గణుతింపబడిన కొమ్ములు తిరిగిన కోలాచలమల్లినాథసూరి అనే మహావిద్వాంసుడు సర్వజ్ఞసింగ భూపాలుని కాలములో అతనిఏలుబడిలో, పండితుల మేలు బంతియై పేరుమ్రోగెను హైదరాబాదు రాష్ట్రమందు ఓరుగల్లు (నేటివరంగల్లు)సమీపంలో, నేటి జనగాం తాలూకాలో, "బమ్మెర" అనే గ్రామము నేటికిని ఉన్నది. ఈ గ్రామమే బమ్మెర పోతన్న గారి జన్మస్థానము. సర్వజ్ఞ సింగభూపాలుని కేళీవిలాసములకై విరాళిగొను మరాళగామినియగు భోగినిపై బమ్మెర పోతన్న గారు దండకము వ్రాసి, భూపాలుని యండ సంపాదింపవలెనని ప్రయత్నించిన ప్రాయ మొకటి పోతన్న గారికి గడచి యుండవచ్చు ఆరాజాశ్రయమునకై నాంది ప్రస్తావనగా యీ రాజానాశ్రయమును సాధింపసమకట్టిన యీ కవి గండడౌ దండకమును వ్రాసియుండవచ్చు. కాని, పోతన్న గారి మనస్సు ఎదురు తిరిగింది. ఆంధ్ర సరస్వతి సాక్షాత్కరించింది. కళ్లనీళ్లు పెట్టుకొని ఏడ్చింది. "ఇంతటి పాండిత్యజ్ఞానము నొక భోగినికి అంకిత మొసంగెదవా? నిజదార సుతోదర పోషణార్థమై నీ జ్ఞానరత్నము నొక యజ్ఞానికి యజ్ఞానివై అమ్మెదవా? విశ్వశ్రేయమైన కావ్యమును నీవు రచించుటకై నీకు నేను ప్రసన్నమైతిని నీ వాక్కులను ఋక్కులనుగా జేయగలడు శ్రీరాముడు. యముడు సమ్మెటతో నిను వేధించి బాధించి, నీ గుండె ఓండి జేయగల డీ దండకము లిక మాను" అని ప్రబోధించింది. ఆ దండకముపై మనస్సు తిరుగుబడి దండెత్తినది ఆయనకు తన జీవిత పరమార్థము, తన జీవిత భాగవతపరమార్థము ఆ భోగినీ భామకలాపానంతరము బోధపడింది భాగవతం భావగతం అయింది హరిభక్తిలో హస్తిరాజు ప్రశస్తి పొందినాడు. పోతపోసిన భక్తిరసమే పోతన్న అన్నారు.

ఆయన కాలంలో రెడ్డిరాజులు, వెలమ ప్రభువులు, విజయనగరరావులు, వీరందరూ గొప్పగొప్ప కవులను పోషించారు ఆ రెడ్డియుగంలో శ్రీనాథుడు కవిసార్వభౌముడై బంగారు పాత్రలలో విందారగించి, పగటి దివిటీలతో కనకాభిషేకాలతో కాలముగడపినాడు చిట్టచివరకు రెడ్డిరాజులుపోయి ఒడ్డెరాజులురాగా "దిన వెచ్చమేరాజు దీర్పగలడు?" అని విలపించాడు. "తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా! నేను శ్రీనాథుడన్" అని ఆ కవిరాజు కంట తడిపెట్టినప్పుడు "సకల సద్గుణ నికురుంబ శారదాంబ"కూడ చేరదీసి ఊరడించలేదు. ఆనాటి కర్ణాటరాజుల చెలిమి కలిమి విషకలుషితమని గ్రహించిన జ్ఞాని పోతన్న. ఆయన "కర్ణాట కిరాతకీచకుల" కుళ్లు కళ్ళార చూచినవాడు. ఆయన మనస్సు ఆ కిరాత కీచకుల కులమువలన నెంత వ్యాకుల

ఘను చెందెనో, అంతస్తీవ్రముగా ఆయన మనస్సు తన్ను తానే తన్నుకొని శిక్షించుకొన్నదనుట పోతన్నలోని యున్నత గుణము. "మనసా! నీకీ రాజుల చెలిమిపై మనసా? ఈ ఆశాపాశమే నీకు యమపాశమవుతుంది." అని తనకు తానే చెంపలు కొట్టుకొని, చివాట్లు పెట్టుకొన్నాడు. "ఓ దురాశా! లంగరెత్తుము లంగరెత్తుము" అన్నాడు సింగమ భూపాలునకిక వంగి లొంగి సలాములు గులాములవలె చేయనన్నాడు.

పెరిగి విరిగితి
  విరిగి పెరిగితి
కష్టసుఖముల పార మెరిగితి
  పండుచున్నవి యాశలెన్నో
ఎండిరాలగ పొగిలితిన్
  అందజాలని పండ్లకొరకై
అగ్రజాపితి వెర్రినై
  నేలబ్రాకెడి తీవలెన్నో
పాదరక్షల మెట్టితిన్
  పంజరంబుననున్న కట్లను
పగులదన్నగలేక క్రుక్కితి
  రక్కసులతో జోడుగూడితి
కవితతో కూడి యాడితి
  లంగరెత్తుము! లంగరెత్తుము!

పోతన్నగారి ఆత్మప్రబోధమే గురజాడ వారిగేయంలో కర్ణపేయంగా ప్రతిధ్వనిస్తోంది.

"కారెరాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిన్ జెందరే?" అని వ్రాసిన పోతరాజు ఆ రాజులవంటి రాజు కాడు. పోతరాజు రాజుల చేతిలో చిక్కెడి కపోతరాజు కాడు. ఆనాటి కాలప్రవాహమునకు ఎదురీది కాలప్రభావమునే తలక్రిందులు చేయుటకై తలక్రిందుగా తపస్సుచేసిన తపోనిధి రాజు పోతరాజు ద్రవ్యాశ వీడిన దివ్యాత్ముడు ఆశ అనేది ఆయనకు దూరంగా తొలగింపబడినదై, ఆయనకు దురాశ దూరాశ అయింది

"పలువలు పల్కు మాటలొకభంగి
  సహించితి, బొమ్మవారి లో
పలనె హరించి, శూన్యమగు
  భావమునన్ వెడనవ్వు నవ్వితిన్;
బొలుపటి విత్తజాడ్య హతబుద్ధుల
  కంజలిచేసితిం; గటా
తలకకే యింక నేపనికి
  దార్చెదునన్ను దురాశ! నీవిటన్

అని ఆశాపాశము లంటగోసిన పోత: ఎత్తిన కేతనము ఆత్మస్వాతంత్ర్యపతాకము. ఆయన భావగతంలో ఆయన అంత[illegible] అయి, జీవకళతో రసజీవి యగుచున్నట్లొ[illegible] రామభద్రుడే ఆయనకీర్తి దశదిశలవ్యా[illegible] విశ్రమించి స్థిరస్థాయిగా ప్రవర్ధమాన మగునట్లు చేసినదికూడా రామభద్రుడే. కర్ణాట కిరాత కీచకులకు "రాం! రాం!" అనిపించినదికూడా ఆత్మారాముడే. ఆశాపాశ క్లేశము లేశములేని పోతనయశము సమస్తాశాంత విశ్రాంత మశ్రాంతమున్ అంటే అందులో వింత రవ్వంత లేదు. ★



# ఏప్రిల్ 7 మొదలు

# "మంచీ - చెడూ"

## రచన: శ్రీ "శారద"

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక పాఠకులకు వచ్చేవారంనుంచి ఒక కొత్త సీరియల్ నవలను అందించగలుగుతున్నందుకు ఆనందిస్తున్నాము.

ఆర్థిక స్తోమతు లోపమైనప్పుడు సమాజంలో జీవనం ఎంత యాతనామయమౌతుందో, ముఖ్యంగా స్త్రీలకు అట్టి పరిస్థితులలో ఎంతటి ఘోరపతనం సంభవిస్తుందో ఈ చిన్న నవల యథాతథంగా చిత్రిస్తుంది. అయితే అమానుషమైన ఈ దుఃఖాంధకారంలో సహజ మానవ సౌశీల్యం, ప్రేమార్ద్రతలు వెలుగుదారులు చూపగలవు నేటి సామాజిక జీవనాన్ని వాస్తవికంగా చిత్రించడానికి రచయిత శ్రీ 'శారద'గారు చేసిన కృషి పాఠకులలో ఔత్సుక్యం రేకెత్తించగలదని ఆశిస్తున్నాము - సంపాదకుడు.

# కుర్చీలో కూనిరాగం

ఆరుద్ర

వారం వారం వెలువడుతున్న ఈ కూనిరాగాలని, ఆసక్తితో ప్రతి వారం చదువుతున్న వాళ్లలో ఒకరైన యడవల్లి రాధాకృష్ణమూర్తిగారు తెనాలినుండి ఇలా వ్రాస్తున్నారు:

"ఆరుద్రగారిని ఆశీర్భ్రకింద వారి ఇంటావిడ - పొరపాటు - ఇంటిగలావిడ పొడవద్దని వేరుపెట్టినట్లుగా, వారి కూనిరాగానికి అభ్యంతరం చెప్పడం కొదను కోండి. ప్రారంభంలో వారి కూనిరాగం చిత్రవిచిత్రగతుల లయబద్ధంగా నడిచింది "సంస్కృతి" నిర్వచనం దొరకక ప్రస్తుత సమాజ మెట్లు తికమకపడుచున్నదీ తమ కూనిరాగంలో సువ్యక్తం చేశారు, ఇలాగే మరికొన్ని సమస్యలను చమత్కారంతో చిత్రిస్తూ నిరాఘాటంగా ధారావాహికంగా సాగిపోతున్న కూనిరాగానికి ఈమధ్య అపశ్రుతి పడ్డదని చేస్తే, వారు ఆగ్రహించరను కొంటా."

ఎంత మాట! ఆగ్రహం ఎందుకండీ రాధాకృష్ణమూర్తిగారూ! ఏదేనా అపశ్రుతి వచ్చిందంటే మీరు చెప్పవలసినదే నిజంగా తప్పుచేస్తే అందుకు క్షమార్పణ నేను కోరుకోవలసినదే. అదీకాక మర్యాద ఉట్టిపడే మీ శైలీ, స్నేహ పూర్వకమైన మీ ఉద్దేశాలు, మాకాక ఆగ్రహం కలుగుతుందా! అనంతర కలగాలి గాని - సరే మీరు ఎత్తి చూపిన అపశ్రుతికి సంజాయిషీ చెప్పుకొంటాను.

మందహాసం చేస్తూ కప్పూ సాసరూ అందిస్తున్న (ఆ కప్పులో కాఫీ ఉందో లేదో నాకుగాని, మీకుగాని ఆమెకుగాని తెలియదు. కాఫీ అయితే బహుశా అది చల్లారిపోయిన కాఫీ అవాలి. లేకపోతే ఆవిర్లు కక్కాలి) చల్లని చూపులతో అల్లరి నవ్వులతో చల్లారిపోయిన కాఫీ అందిస్తున్న అభినేత్రి భానుమతి ముఖపత్ర సుందరిగా ఉన్న ఆంధ్ర 'హిందూ' పత్రికలో విద్యార్థి 'మేగజీను'లమీద నేను ఏదో ఆలాపించాను. అందులో అపశ్రుతి ఉందని రాధాకృష్ణమూర్తిగారి అభిప్రాయం.

"తమ కూనిరాగంలో... కాలేజీ మాగజీన్లలో చదువదగ్గవి రెండుమూడు వ్యాసాలే నని, హైస్కూలు మాగజీన్లు మరీ అధ్వాన్నమన్నట్టును వ్రాశారు. అది విద్యార్థిలోకానికి అపచారమేమో ననుకొంటాను" అని సహృదయులైన రాధాకృష్ణ మూర్తిగారు భావిస్తున్నారు. అపచారమా కాదో తరవాత చూద్దాంగాని, అసలు కాలేజీ మాగజీన్లలో చదువదగ్గవి రెండుమూడు వ్యాసాలేనని రాధాకృష్ణమూర్తిగారు కూడా అంగీకరించుతున్నట్టు కనబడుతున్నది. అందుకు సమర్థనీయమైన కారణాలు కూడా చెప్పారనిపిస్తుంది.

"జీవితాన్ని కాచి వడపోసి జీవిత నగ్న సత్యాన్ని చవిచూచిన వ్యక్తివలె రచనలు చేయలేదని విద్యార్థులపై నిందమోపుట శోచనీయం. అలాగైతే చిన్ననోటికి పెద్ద శోకం అన్నట్లుంటుంది." అని చెపుతూ విద్యార్థి రచనలలోని "శిల్పమును నిర్ణయించి అవగతము చేసుకొనవలసినవారు వారి సహాధ్యాయులైన విద్యార్థులు వారి కర్థమగునటుల వారికి తగినట్లు రచనలున్న చాలును" అని విద్యార్థి రచనకి ప్రయోజనం ఏమిటో ప్రతిపాదించారు

నేను చెప్పేదికూడా ఇంతే. కళాశాల మాగజీన్లు కళాశాలల నిమిత్తమే అందులోని ప్రతి అక్షరం, రాసినవాళ్లకీ ఆ రాసిన వాళ్ళ సహాధ్యాయులకీ శిల్ప సమన్వితంగానే ఉంటుంది వాళ్ళసహాధ్యాయులం కాని మనలాంటివాళ్లు చదివి ఆనందించదగ్గవి రెండుమూడు ఉంటే ఉండొచ్చు ఉండాలన్న నియమంలేదు ఉంటే మంచిదే కానీ విద్యార్థులు కూడా చదువ కూడనివీ రాయకూడనివి ఉంటేమట్టుకు అది 'శోచనీయం' పైగా అదే 'విద్యార్థిలోకానికి అపచారం'

నేను నా కూనిరాగంలో ఒకానొక హైస్కూలు పత్రికలోని రచనలని ఎత్తి చూపాను. వాటిని రాధాకృష్ణమూర్తిగారు చాలా శ్రద్ధగా చదివే ఉంటారు. అయినా ఆ రచనలు విద్యార్థిలోకానికి అపచారం అని వారికి ఎందుకు తట్టలేదో? బహుశా విద్యార్థులపై వారికిగల సానుభూతి, అనురాగం ఆ రచనలలో ఉన్న 'అసభ్యతని' మన్నించి ఉండవచ్చు ఆ రచనలల్లో ఎలాంటి 'నీతు'లున్నాయో చిత్తగించండి

ఆ పత్రికలో ఒక విద్యార్థి చదువుకొనే ఆడపిల్లలమీద పద్యం రాశాడన్నానే. ఆ పద్యపాదాలు చూడండి, వాటి అర్థం చూడండి. "హైస్కూలులో చదువుకొనే ఆడపిల్లలు రాబోయే తరంవాళ్ళకి మదర్స్ అంటే మాతృదేవతలు" బాగానే ఉంది. "ఈ మాతృదేవతలకి, ఆ హైస్కూల్లో చదువుకొనే మగపిల్లలంతా నిజానికి బ్రదర్స్ అనగా భ్రాతలు కావాలి గాని అలా అందర్నీ పిలవడంలో అందం లేదట! అందుచేత పైపైకిమాత్రం మధికట్టుకొని ఆడపిల్లలు నీతిగా ప్రవర్తిస్తారట. కనిపించిన మగవాడల్లా ఆ ఆడపిల్లల లవర్ అనగా ప్రియుడట!" ఇంతకన్న శోచనీయంగాని విద్యార్థిలోకానికి అపచారంగాని ఉందేమో ఆలోచించండి ఆ విద్యార్థి కవి అంతటితో ఆగలేదు. "ఆ చదువుకొనే ఆడపిల్లలు కనిపించిన ప్రతి మగవాడిమీద తమ అస్త్రాల పవర్ అంటే శక్తి ప్రయోగిస్తారట క్లాసులో దొంగచూపులు చూస్తారట పెళ్ళి చేసుకొన్నాక స్వేచ్ఛ పేరిట మగాళ్ళనెత్తిమీద జిల్లేడాకులు పెట్టించి విడాకులిచ్చేస్తారట" రామ! రామ!

స్త్రీవిద్య రోజు రోజుకి పెరుగుతున్న ఈరోజుల్లో కూడా చదువుకొన్న ఆడదిఅంటే కొంతమందికి చులకనగా నేఉంది. ఆ ఆడపిల్లలంతా చెడిపోయినట్టే భావిస్తారుకొంతమంది. చదువుకొన్న ఆడదాన్ని హేళనచేస్తే సమాజం ఇట్టే హర్షించి నవ్వుతుంది సమాజాన్ని నవ్వించడానికి ఇంత నీచానికి మన సినిమా డైరెక్టర్లలో, కళాకారులలో మహామేధావిగా చెలామణీ అయిపోతున్న శాంతారామే దిగాడు. శాంతారాం "తీన్ బత్తీ చార్ రస్తా" అనే చిత్రం ఒకటి తీశాడు. గమనించారో లేదో అందులో ఒక చదువుకొన్న ఆడది కథానాయకుడిని తొలిసారి కలుసుకొన్న ఘట్టంలో - ఆ చదువుకొన్న ఆడది "హాలో!" అంటూ షేక్ హేండ్ ఇవ్వడానికి చెయ్యి చాస్తుంది. కథానాయకుడు మట్టుకూ ఆ చాపిన చెయ్యి అందుకోకుండా పరమ పవిత్రంగా తన రెండు చేతులు జోడించి 'నమస్తే' అంటాడు. ఆ ఆడదాని 'చెస్టతనా'న్నీ అందుచేత ఆవిడకి కలిగిన ఈ 'పరాభవా'న్ని చూసి ప్రేక్షకులు ఘొల్లున నవ్వారు

సరే అదలా ఉంచండి ఈ విద్యార్థి రచననే చూడండి చదువుకొనే ఆడపిల్లలమీద నీచాభిప్రాయాలు వెలిబుచ్చిన ఆ రచన ఆ కుర్రాడు ఎందుకుచేశాడో మనం ఊహించవచ్చు ఆ విద్యార్థి స్కూలుఫైనలు క్లాసు చదువుతున్నాడు. అంటే మహా అయితే పద్దెనిమిదేళ్ళు కూడా ఉండకపోవచ్చు. ఈ వయస్సులోనే "లైంగిక కౌతూహలం" ఏర్పడుతుంది. బాల్యంలోనుండి యౌవనంలోకి అడుగుపెట్టే వయస్సు అదే. ఈ పరి



విలాసిని

చిత్రకారుడు : పి. గజపతిరావు, శ్రీకాకుళం

# కుర్చీలో కూనిరాగం

కౌమార వయస్సులో ప్రాథమిక మోహం రకరకాల విజృంభించే అవకాశా లున్నాయి. ఆడపిల్లల నవవయో విలాసాలు మగపిల్లలలో రకరకాల కోరికలు రేకెత్తించవచ్చు. జ్వరంలాంటి మోహంతో ఉదుకెత్తించే భావాలు కలుగవచ్చు ఆశలు రావచ్చు. ఈ కోరికలను తీర్చుకొనడానికి సవాలక్షమార్గా లున్నాయి అందులో సవ్యమైనది పవిత్ర ప్రేమ - లక్షణమైన పెళ్ళి. ప్రేమ పెళ్లి సంభవించనప్పుడు అపసవ్యమైనవి అనేకం జరుగుతాయి కోరికలు తీరని కోరికలుగా ఉండిపోతాయి

మన సత్వశాస్త్రరీత్యా తీరని కోరికలని ఎలా సబిలిమేట్ చేసుకొంటామో చూడవచ్చు. మామూలుగా మన తీరని కోరికలని మనం కలలలో తీర్చుకొంటాం అలాగే కళలలోకూడా తీర్చుకోవచ్చు రాయడం చేతనైనవాడు, రచనలలో తన కోరికలు తీర్చుకుంటాడు నేను ఉటంకించిన విద్యార్థికి రాయడం చేతనవును ఆ విద్యార్థి తన అక్కసుని రచనలో వెళ్ళ కక్కుకున్నాడు. లైంగిక కౌతూహలం అంకురిస్తున్న సున్నితమైన వయస్సులో సుకుమారమైన మనస్సులలో ఆడదానిమీద రాగానికి బదులుగా ఒకప్పుడు ద్వేషంకూడా కలుగవచ్చు. అలా కలిగిన ద్వేషంచేత బహుశా ఆ విద్యార్థి అలాంటి రచన చేసేడేమో. దాన్ని మనం అర్థం చేసుకోగలం గాని దాన్ని పాఠశాల పత్రికలో అచ్చువేసిన అయ్యవార్ల నేమనాలి?

ఔచిత్యం తెలియని అయ్యవార్లుంటే అనర్థాలు జరుగుతాయి నేను ఉదహరిస్తున్న పాఠశాల పత్రికలో ప్రధానాంధ్ర పండితుడి 'చాటువులు' కూడా కొన్ని చూపెట్టాను. అవి ఆయన రాయకూడదని నేనను అవి పాఠశాల పత్రికలో 'అచ్చు వెయ్యవచ్చా? అలా అచ్చువేస్తే విద్యార్థి లోకానికి అంతకన్నా అపచారం ఉంటుందా? అందులో ఒక పద్యం అర్థంని చూడండి '

"ఓ దారంట పోయేవాడా? ఉండుండు వెళ్లిపోకు! నువ్వు రాజవైద్యుడవో, జ్యోతిష్యుడవో, మా అత్తగారు గుడ్డిది, మా ఆయన ఊళ్ళో లేరు. ఆవిడకి కళ్ళెలా వస్తాయి. ఆయన ఊరినుండి ఎప్పుడొస్తారు కాస్తా చెపుదూ" అని ఆ పద్యానికి ప్రతిపదార్థం చెప్పుకోవాలి. గాని దాని భావం మట్టుకూ వేరు. అసలర్థం చెప్పమంటే ఆ ప్రధానాంధ్ర పండితులే చెప్తారు. "ఓయి దారంట పోయేవాడా! నువ్వంటే నాకు మక్కువ కలిగింది. మా అత్తగారికి కళ్ళు లేవు. మా ఆయన ఊళ్ళో లేడు. మనకి మరేం అడ్డు లేదు కాబట్టి నువ్వు వెళిపోకు" ఇదీ దాని తాత్పర్యం.

ఇలాంటి పద్యాలు ఒకటా రెండా. ఆ ప్రధానాంధ్ర పండితుడుగారు అచ్చువేసిన అన్ని పద్యాలలోనూ ఇంత దివ్యమైన వ్యంగ్యం ధ్వని ఉన్నాయి ఈ పద్యాలని వేరే అచ్చువేసుకోడానికి అవకాశం రాకో, ఇష్టం లేకో, లేకపోతే అచ్చు వేసుకొనే అవకాశం వచ్చిందనో ఆ పండితులు పాఠశాల పత్రికలో వాటిని అచ్చువేశారు. అది తగునా అన్నదే నా ప్రశ్న!?

ఏమండీ రాధాకృష్ణమూర్తిగారూ! విద్యార్థి రచనలను "అవగతము చేసుకొనవలసినవారు, వారి సహాధ్యాయులైన విద్యార్థులు." "వారికి తగినట్లు రచనలున్న చాలును" అని మీరు కూడా అభిప్రాయపడుతున్నారుగదా నేను చూపెట్టిన ఈ రెండు రచనలు విద్యార్థులకి తగినట్లు ఉన్నాయా? మీరే చెప్పండి

కళాశాల పత్రికలలో, హైస్కూలు మేగజీన్లలో అధ్యాపకులు, పండితులు వ్యాసాలు రాయవలసిందే పద్యాలు అచ్చు వెయ్యవలసినదే విద్యార్థులకి మార్గదర్శకమైన రచనలను ప్రచురించాలి. హైద్రాబాద్ ఉస్మానియా కళాశాల వాళ్ల పత్రిక 'శోభ' అనేది వస్తూఉంటుంది. అందులో ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారూ, ఆచార్య దివాకర్ల వెంకటావధాని గారూ వ్యాసాలు వ్రాస్తూఉంటారు. వాటిప్రయోజనం ఎంతైనా ఉంది. తక్కిన కళాశాల పత్రికలలో తక్కినపండితులు ఎన్నిరచనలు అచ్చు వెయ్యటం లేదు వాళ్ళందరూ ఈ మాత్రం చాటువులు చెప్పలేకనా, తలచుకొంటే హాలుడికీ కాళిదాసుకీ అంతకన్నా రమ్యమైన తర్జుమాలు చేయలేకనా, ఔచిత్యం పాటించి కళాశాల పత్రికలలో అచ్చు వెయ్యటంలేదు గాని.

కాబట్టి, రాధాకృష్ణ మూర్తిగారూ! పాఠశాల పత్రికలలోని రచనలన్నీ బాగుండవు అని మనం మనస్సులలో అనుకొన్న విషయాన్ని బయటకు చెప్పడంలో విద్యార్థిలోకానికి మనమేమీ అపచారం చెయ్యడం లేదనుకొంటా. ఆ విద్యార్థులని హీనంగా చిత్రించే రచనలూ, ఆ విద్యార్థులకి 'తగినట్లు' లేని రచనలూ ఆ పత్రికలలో పడి, విద్యార్థిలోకానికి అపచారం అపకారం చేస్తున్నప్పుడు వాటిని గర్హించకపోతేనే అపచారం అనుకొంటాను. అందుచేత కూనిరాగంలో అపశ్రుతి లేదని నానమ్మకం

* * *

మనలో కొంతమందిమి మాట్లాడేటప్పుడు ఇంగ్లీషుపదాలు తరచుగా వాడుతూ ఉంటాం. మనం మాట్లాడేటట్టే పద్యాలు రాస్తే బాగుంటుంది అనుకొని నేను ఇంగ్లీషు పదాలు వాడుతూ కొన్ని రాశాను. అలా రాసినవాటిలో

"బ్రెయిన్‌లో బ్రెన్‌గన్
రైయిన్‌లా ఆలోచనల ట్రెయిన్
స్పయినల్ కార్డులో స్ప్రెయిన్."

అనే 'త్వమేవాఽహం'లోని రచన లున్నాయి ఈ రచన చాలామందికి అర్థం కాలేదు అన్న సంగతి నాకు క్రమేణా అవగతం అయింది ఆ పద్ధతి రచనలు ఆట్టే ప్రయోజనకారులు కావు అన్న సంగతి నా పరిశోధన అనుకొన్నంత సఫలీకృతం కాకపోయిన తరవాతగాని నాకు తెలియక పోవడంలో తప్పేం లేదు.

"బ్రెయిన్‌లో బ్రెన్‌గన్" లాంటి నా రచనలే నేను విమర్శించిన పాఠశాల విద్యార్థి రచనకి కారణం అని ఆ బాధ్యత నాదే అని యడవల్లి రాధాకృష్ణమూర్తిగారు ఇలా వ్రాసేరు.

"అసలు ఆరుద్రగారి విమర్శకు గురియైన ఆ విద్యార్థి రచన

పిళ్లంతా వచ్చే జనరేషన్ వాళ్ళకి
మదర్స్
నిజానికీళ్ళందరూ కావాలి బ్రదర్స్
*Etc.*

పై రచనల అనుకరణ అని చెప్పవచ్చు. అందులో అతని బాధ్యత అంతగా లేదనుకొంటాను. అట్టి పరిస్థితులలో వారి సోదర తుల్యుడైన ఒక వ్యక్తిపైన కినుక బూనటము సమంజసము కాదేమో"

బాగానే ఉంది! రాసే పద్ధతిని కాదు నేను విమర్శించినది, రాసిన విషయాన్నే పద్యానికి టెక్నిక్కు ముఖ్యమే గాని విషయం మంచిదికానప్పుడు ఆ టెక్నిక్కు అడవిగాచిన వెన్నెల నా "త్వమేవాహం" టెక్నిక్కుని అనుసరించిన విద్యార్థి ఇంత అనౌచిత్యంగా ఆడపిల్లలకి అపచారం చేసే రచన చేశాడే అని అతడి ఆలోచనలు సక్రమంగా మారుతాయేమో అన్న సదుద్దేశంతోనే ఈ విమర్శ చేశాను సోదరతుల్యుడు కోపిస్తే చేయవలసివచ్చింది చాకుతో పెన్సిలు చెక్కుకోవచ్చు - గొంతుక కోసుకోనూ వచ్చు విద్యార్థి పెన్సిలు చెక్కుకోడమే మంచిది పదునైన టెక్నిక్‌తో స్త్రీజాతిని మెచ్చు

(56-వ పేజీ చూడండి)

# సూరయ్య నిర్ణయం

సూరయ్య ఆఫీసునుంచి ఇంటికి తిరిగి వచ్చేసరికి గుమ్మంలమీద ఏదో కుక్క అడ్డంగా పడుకొని ఉంది. మూడో మెట్టుమీద కుక్క ఉందని మొదటి మెట్టు ఎక్కేవరకూ అతను చూడనేలేదు. చూసి వెనక్కి ఒక అడుగు వేశాడు. సూరయ్యకు కుక్కలమీద నమ్మకం లేదు. అవి మంచివో వెర్రివో వాటి మొగాన రాసి ఉండదుగదా. అందులోనూ ఇది చాలా పెద్దకుక్క. ఆవుదూడ అంత వుంది. వీధికుక్కే కావచ్చును కాని కరవదని హామీ ఎక్కడ? సూరయ్య అలాగే నిల్చుండిపోయాడు. కాసిని కాఫీనీళ్ళకోసం తన ప్రాణాలు తపనపడుతూంటే అది తీరికగా తనకేమీ పట్టనట్లుగా పడుకొని ఉంది. మెల్లగా, గొడుగుతో మెట్టుమీద కొట్టుతూ "చూ, చూ" అన్నాడు సూరయ్య. అది ఒక కన్ను తెరిచి 'గ్ ర్ ర్ ర్' అంది కదలకుండానే. సూరయ్య మరో రెండు అడుగులు వెనక్కి వేశాడు. ఇంతలో గుమ్మం తలుపులు తెరచుకున్నాయి ఇంటావిడ - సూరయ్య భార్య - ముందతనిని చూసింది; తరువాత కుక్కను చూసింది. చూడడమే తడవుగా దాని మెడమీద గట్టిగా ఒక తన్ను తన్నింది. దానితో ఆ కుక్క 'కుయ్యో' మంటూ పరుగెత్తుకుపోయింది. ఇంటావిడ లోపలికి చక్కాపోయింది.

సూరయ్య లోపలికి వచ్చాడు. గది మధ్య కొంతసేపు గొడుగుమీద ఆనుకొని నిలబడ్డాడు. మళ్ళీ గొడుగు ఒక మూలపెట్టి, కోటు చిలకకొయ్యకు తగిలించి, దొడ్లోకి పోయి, మొగం కాళ్లూ చేతులూ కడుగుకున్నాడు. తువ్వాలుతో తుడుచుకుంటూ వంటింటి గుమ్మంవద్ద ఆగాడు. భార్య అరటికాయలు తరుగుతోంది. కాఫీ ఇమ్మని అడుగుదామని రెండుసార్లు నాలుక చివరవరకూ వచ్చింది. కాని ఆమె కూర తరగడం వరస చూసి ఆగిపోయాడు. ఆమె కాయలు చకచక తరిగివేస్తోంది. కొంతసేపు చూసి చూసి కాళ్ళీడ్చుకుంటూ వచ్చి పాత పేము కుర్చీ గోతిలో కూలబడ్డాడు. అప్పుడే లోపలికి వచ్చిన మూడో కూతురిని దగ్గరికి పిలిచి, "అమ్మనడిగి కాఫీ తెచ్చిపెట్టమ్మా" అని అడిగాడు. "నేను ఆడుకోవాలి, లే"నంది ఆ పిల్ల. "అమ్మ, అమ్మ, నా తల్లివి కాదూ. నీవు చాలా మంచిపిల్లవి. తెచ్చిపెట్టమ్మ నీరసంగా ఉంది" అన్నాడతను. ఆ పిల్ల ఏ ధోరణిలో ఉందో లోపలికి పోయివచ్చి "నిన్నిచ్చి తీసుకోమంది. అమ్మ" అని చెప్పి వీధిలోకి పరుగెత్తుకుపోయింది. సూరయ్య మెల్లగాలేచి వెళ్లాడు. "కాఫీ ఏదని" అడిగాడు.

"అలాగే నుంచోండి నోటికివస్తుంది! రాజులకేనా ఉండదీ దర్జా" అంది భార్య విసుగ్గా.

సూరయ్య అలమారా తీసి కాఫీ గిన్నె తీసుకొని కప్పులో పోసుకున్నాడు.

"ఏమయింది?" అని అడిగింది భార్య తీక్ష్ణంగా కూరలు తరుగుతూనే.

"ఏమిటి?" అన్నాడతను అమాయకంగా.

"ఏమిటి నా నెత్తి! ఏమిటనేవరకూ వచ్చిందీ—"

ఆ నీరసావస్థలో అతని కింకా జ్ఞాపకం రావడంలేదు.

"మానేజరు ఏమన్నాడంట?-"

## వా. స. మూర్తి

సూరయ్యకు జ్ఞాపకం వచ్చింది. గుండె అదిరింది.

భార్య నెలరోజులనుంచీ అతనిని చంపుకు తింటోంది, మేనేజరుతో మాట్లాడి జీతం పెంచమని యజమానికి రాసేటట్లు చేయమని. సూరయ్య ఎన్నడు తన పనేదో తను చూసుకోవడమే తప్ప స్వయంగా మేనేజరు దగ్గరకుపోయి ఎరగడు. మేనేజరే పిలిచినప్పుడు నిశ్శబ్దంగాపోయి, ఏదో చిన్నతప్పుకు ఆయన చీవాట్లు పెట్టితే మారుమాటాడక పడేవాడు, లేక ఆయన ఏదైనా పని చెప్పితే 'చిత్తం', 'చిత్తం' అని వచ్చేసేవాడు. అటువంటిది మేనేజరు దగ్గరకుపోయి జీతం పెంచమని సిఫారసు చేయమని చెప్పడమే! అతనికి సాహసం చాలలేదు. కాని ఇంటిదగ్గర పోరు పడలేక ఎప్పటికప్పుడు చెపుదామనుకునేవాడు కాని తీరా సమయం వచ్చేసరికి కాళ్లు కదిలేవి కావు కాళ్లు కదిలినా పెదవులసలే కదిలేవి కావు. ఆఖరికి ఒకరోజున మేనేజరే - ఆవేళ ఏమి ఉత్సాహం పొంగివచ్చిందో కాని—గుమాస్తాల నందరినీ పలకరిస్తూ సూరయ్య, "ఏమండీ సూరయ్యగారూ, అంతా కులాసా?" అని అడిగాడు. ఆసందర్భంలో సూరయ్య ఎలాగో తాను చాలా కష్టపడుతున్నానని, జీతం పెంచేటట్లు యజమానికి వ్రాయవలసిందనీ విన్నవించుకోగలిగాడు. "ఓ, అలాగే చూదాం" అన్నాడు మేనేజరు. అంతే, మళ్ళీ ఆ విషయం ఏమి చేసిందీ ఆయన సూరయ్యకు చెప్పనేలేదు. చెప్పకపోయినా సూరయ్య ఊరుకోగలడు కానీ సూరయ్య భార్య ఊరుకోగలదా? "ఏమయింది? ఏం జవాబు చెప్పాడు" అంటూ రోజూ భర్తను నిలదీస్తోంది. దానితో తట్టుకోలేక, అటు మేనేజరునీ గట్టిగా అడగలేక, ఒకసారి మెల్లగా అన్నాడు "ఆ ఉత్తరంమాట?" మేనేజరుకేమీ జ్ఞాపకం లేనట్లేఉంది. "ఏ ఉత్తరం?" అన్నాడు. "వెనక నేనొకసారి మనవి చేసుకున్నాను జీతం పెంచమని సిఫారసు—" అంటూ ఆగిపోయాడు సూరయ్య. "ఓ అదా, చూదాం" అన్నాడు మళ్ళీ మేనేజరు, అది ఎంతో తీరిక విషయమైనట్లు. సూరయ్య భార్యకు మాత్రం తీరిక విషయం కాదు. మళ్ళీ రెండుమూడుసార్లు మేనేజరును సూరయ్య అడిగేటట్లు చేసింది. మేనేజరు విసుగుకోవడం మొదలుపెట్టాడు. ఈవేళ తేల్చి చెప్పివేశాడు—తను రాశానని, కాని యజమాని వీలులేదన్నాడని.

సూరయ్య పెద్ద చింతించలేదు. అతనెన్నడూ ఆశలు పెట్టుకోలేదు. భార్యకు ఏదో కచ్చితమైన జవాబు చెప్పడం అవసరం కాబట్టి ఆ జవాబుకోసం ఇన్నాళ్లూ ఎదురు చూశాడు. ఇప్పుడు కచ్చితమైన జవాబు వచ్చింది. ఇక తన బాధ్యత తీరిందనిపించిందతనికి. కాని ఆ కచ్చితమైన జవాబు భార్యకు తెలియజేయడమెలా? - కొంచెంసేపు గొంతు సవరించుకొని, "రాశాడట. యజమాని జీతం పెంచడానికి వీలులేదన్నాడట" అన్నాడు, ఆ జవాబుకు ఏం అగ్నిపర్వతం బ్రద్దలవుతుందోనని భయంతో చూస్తూ.

"దరిద్రపు మొహాలను చూస్తే అంతే చెప్తాడు ఎవడైనా" అంటూ భార్య కూరగిన్నెనుఎత్తి నేలను పెట్టికొట్టింది. సూరయ్య గుండె దడదడ కొట్టుకో సాగింది. అక్కడనుంచి కదులుదామనుకున్నాడు కాని కదలబోయేసరికి భార్య అంది: "ఈ మేనేజరుతో ఏమిటి మన్య. తిన్నగాపోయి యజమానితోనే మాట్లాడాలి."

# ★ సూరయ్య నిర్ణయం ★

"యజమానితోనా! –"

"ఔను, యజమానితోనే. మధ్య వెధవల మీద ఆధారపడితే ఇలాగే ఉంటుంది"

"యజమానితో – లాభం లేదనుకుంటాను"

"లాభం లేదూ! – లాభం ఉందో లేదో ముందుపోయి మాట్లాడటానికేమంట?"

సూరయ్య జవాబు చెప్పలేక ఇవతలికి వచ్చాడు.

భార్య, "ఈ దరిద్రపు సంసారం ఎవ తీదుతారు? ఎప్పుడూ ఇబ్బందే! చాలీ చాలని జీతంకోసం ఈ వెధవ ఉద్యోగం చేస్తేనేం, చేయకపోతేనేం" అంటూ ఇంట్లో ఉన్న గిన్నెలూ, చెంబులూ వగైరాలు పగులగొట్టివేస్తోంది. ఎన్ని సొట్టలు పడ్డాయో, ఎన్ని విరిగిపోయాయో, ఎన్ని తుక్కైపోయాయో!

ఆ చప్పుళ్లకు సూరయ్య ఒళ్లు జల్లుమంటోంది. తన గుండెమీదే సమ్మెటలు పెట్టి కొట్టినట్లవుతోంది. బిత్తర చూపులు చూస్తూ తల వాల్చుకొని కుర్చీలో కూలబడ్డాడు. అటువంటి సమయాల్లో అతనికి తరుచు వచ్చే ఎడమచేతి వణకు తీవ్రంగా వచ్చింది.

భార్య చెప్పినట్లు చేయకపోతే ముందు ఏముంటుందో సూరయ్యకు తెలుసు. అది తలచుకుంటే అతని గుండె దిగజారిపోతోంది. కాని అటు యజమానితో మాట్లాడ్డమే! అది తలచుకున్నా అంత పనీ అవుతోంది. అసలు మేనేజరుతో మాట్లాడడానికే భయం. అటువంటిది యజమాని మాటే తలపెట్టగలడా. యజమాని అంటే అతనికొక మనిషిలాగే కనుపించడం లేదు. తన పంచప్రాణాలు అతని చేతిలో ఉంటాయి. అతనొక రావణాసురుడివంటివాడై యుంటాడనే భావం సూరయ్య మనస్సులో నాటుకుపోయింది. యజమానిదగ్గరకు పోవడమంటే పెద్దపులి ముందుకు పోవడంలా కనుపించింది. కాని ఇంట్లో పెద్దపులి మాట ఏమిటి? బయట పెద్దపులితో ఒక మాటే దర్శనమైతే ఇంట్లో పెద్దపులితో రోజూ బాధే! పోనీ ఒక వేళ సాహసించి యజమాని దగ్గరకు వెళ్లినా మాట్లాడడమెలా? ఒక వేళ మాట్లాడినా యజమాని వింటాడా? విన్నా ఒప్పుకుంటాడా? ఒప్పుకోకు పోనీ ఒప్పుకోకపోతే పోనీ. కోపం వచ్చి ఉద్యోగం నుంచే తీసిపారేస్తానంటే! కొంప మునుగుతుంది. నిజంగా అంత పనీ జరుగుతుంది. యజమానికి తప్పకుండా కోపం వస్తుంది. ఉద్యోగంనుంచి తీసిపారేస్తాడు. తనలాటి వాళ్ళు లక్షమందిఉంటారు అదే ఉద్యోగం కోసం కాచుకొని. తన్ను తోసివేసి యజమానిదగ్గరకు పోయినందుకు మేనేజరుకు కూడా కోపం వస్తుంది కాబట్టి తన ఉద్యోగం పోవడం ఖాయం. యజమాని దగ్గరకు పోకపోతే ఇంట్లో పోరు ఖాయం. ఏదో ఒక నిర్ణయం చేయాలి. "ఏది దారి దేవుడా" అనుకున్నాడు సూరయ్య నిస్పృహతో.

ఇంతవరకెన్నడూ సూరయ్యకు నిర్ణయాలు చేయవలసిన అవసరం రాలేదు. చిన్నప్పుడు తల్లిదండ్రులే నిర్ణయాలు చేసేవారు. తండ్రి చదవేస్తే చదువుకున్నాడు. పెండ్లి చేసుకోమంటే చేసుకున్నాడు. ఇక చదువు చాలునంటే చదువు మానివేశాడు. తండ్రే నానా తిప్పలు పడి అతనికి ఉద్యోగం సంపాదించి పెట్టాడు. సూరయ్య ఉద్యోగంలో ప్రవేశించడంతో బాటే భార్యకూడా కాపురానికి వచ్చింది. అప్పటినుంచి నిర్ణయాలన్నీ భార్యవే. నిర్ణయాల భారం ఇంకొకరికి అప్పజెప్పినా ఆ నిర్ణయాల ఫలితం మాత్రం అనుభవించక తప్పలేదు సూరయ్యకు. జీతంరాళ్లు రాగానే అవి వచ్చినవి వచ్చినట్లుగానే భార్య చేతిలో పోస్తున్నాడు. భార్యే అన్ని ఖర్చులూ చేస్తోంది. అయినా అన్ని వస్తువులకూ లోటే కనిపిస్తోంది. చిన్న అప్పులూ, పెద్ద అప్పులూ విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఖర్చు చేసేది తను కాకపోయినా ఈ అప్పులకూ లోటులకూ బాధ్యత అంతా తనదే అన్నట్లు భార్య తనమీదే విరుచుకుపడుతోంది. ఎందుకీ వెధవ నౌఖరీ అంటుంది. కాని తనలాటివాళ్ళకంతకన్న పెద్దఉద్యోగాలేమి దొరుకుతాయి? పెద్ద జీతాలెలా వస్తాయి? ఆ జీతంమీదే గడుపుకోవాలి. ఖర్చులు తగ్గించుకుంటే గడుపుకోవచ్చు కూడా. భార్య చేసే ఖర్చులలో కొన్ని తప్పక తగ్గించవచ్చు. తగ్గించవలసిన అవసరంకూడా కనుపించింది. కాని ఆ ఖర్చులు తగ్గించమని భార్యతో అంటే 'నా కెందుకీ వెధవ బాగరబందీ – మీరే చూసుకోండి' అని సంసారభారమంతా తన నెత్తిమీదే పడవేస్తుంది. అది మరీ చిక్కు. సంసారం ఈదే ధైర్యం తనకు లేదు. అందుకే తప్పించుకు తిరుగుతున్నాడు. కాని ఇప్పుడు ముందున్న సమస్యను మాత్రం తప్పించుకోవడానికి ఉపాయం తోచడంలేదు ఇలా ఆలోచనలలో మునిగి తేలుతూంటేగా ఎంతసేపు గడచిందో అతనికి గుర్తే లేదు. బాగా ప్రొద్దుపోయేసరికి తానింకా భోజనం చేయలేదన్న సంగతి జ్ఞాపకం వచ్చిందతనికి. రోజూ అందరి భోజనాలయిపోయి, నిద్రపోయే వేళ అది. అయినా భోజనానికి పిలుపురాలేదు. అప్పుడే ప్రారంభమయింది యుద్ధమనుకున్నాడు. చడీ చప్పుడూ కాకుండా వంటింట్లోకి పోయిచూశాడు, గిన్నెలలో తనకేమైనా అన్నం, కూరలూ ఉన్నాయేమోనని. వట్టిగిన్నెలే ఉన్నాయి.

(48–వ పేజీ చూడండి)



# కల - ఇల - కథ!

కలలో జరిగింది యిలలో జరగదంటారు. కాని కలలో జరగందే యిలలో జరిగింది. ఆనందరావు దుస్స్వప్నంలో కూడా వూహించనిది తన కళ్ళతోనే చూశాడు! తన చెవుల్తోనే విన్నాడు!

ఆనందరావు అన్నపానాదుల్నికూడా లెక్క చేయకుండా అహోరాత్రుళ్ళూ రెండు సంవత్సరాలపాటు యూనివర్సిటీలో - జియాలజీ రిసెర్చిలో కృషిచేసి డిగ్రీ అందుకొని, విశాఖపట్నంలో బండెక్కి నేరుగా అత్తారింటికి బయలుదేరాడు. రెండు సంవత్సరాలనాడు లేబరేటరీ టెస్టుట్యూబుల్లో అడుగున బడిపోయిన పెళ్ళాం రవణమ్మ మీది ప్రేమా, వూహలూ వొక్కసారిగా పెల్లుబికి వచ్చాయి. తన్ను హఠాత్తుగా చూసేసరికి రవణమ్మ వుక్కిరిబిక్కిరైపోతుంది. ఎంత రాత్రయినా సరే రవణమ్మ దగ్గిరికిపోయి వాల్తాడు. తనకు రవణమ్మ మీదున్న ప్రేమని - రెండు సంవత్సరాలుగా నిగ్రహించుకొన్న ప్రేమను - వొక్కసారిగా కుమ్మరించి, తనను క్షమించమని వేడుకొంటాడు. అలా వుత్తరం ముక్కయినా రాయకుండా, అర్ధరాత్రిపూట వెళ్ళిన తన్ను చూసి రవణమ్మ ఎంత ఆనందిస్తుంది?

అర్ధరాత్రిపూట బండిదిగి అత్తారింటికి పోయి పెళ్ళాన్ని ఆశ్చర్యంలో ముంచివేయాలనుకున్న ఆనందరావు పాపం తనే ఆశ్చర్యంలో పడిపోయాడు! పెరటి దొడ్డి వాకిట్లో తను చూసిందేమిటి? తన కళ్ళతోనే చూశాడు! పెళ్ళాం రవణమ్మ - వో మగాడు! తన చెవుల్తోనే విన్నాడు. ఆ మగాణ్ణి తన అలింగనంలోకి తీసుకొంటూ ఏమంది రవణమ్మ?

ఈ రవణమ్మే, ఆనాటి రాత్రి తన్ను అలానే అంది. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన రవణమ్మ, ధర్మపత్ని రవణమ్మ, తను మనసారా ప్రేమించిన రవణమ్మేనా యిది?

అసలీ రవణమ్మను తను పెళ్ళాడింది అంత అందగత్తె అనీ కాదు. చదువుకొన్నదనీ కాదు. ఏదో వున్న కుటుంబం, గుణవతి అయిన పిల్లా అనీ చేసుకొన్నాడు. రెండు సంవత్సరాలు తనతో కాపరం చేసి; సీతా, సావిత్రులను మరిపించిన పతివ్రత రవణమ్మ ఇలాటి పని చేస్తుందని ఎలా అనుకొంటాడు. ఆనాడు తను యూనివర్సిటికి పోతున్నప్పుడు రవణమ్మ కార్చిన కన్నీళ్ళన్నీ గ్లిసరిన్ నీళ్లేనా? యీ రెండు సంవత్సరాల్లో ఎంత ప్రేమనూ, బాధనూ వలకపోసింది వుత్తరాల్లో?

జీవితంలో భాగం పంచుకొన్న వ్యక్తీ, అర్ధాంగీ, రవణమ్మ యింత ద్రోహం చేస్తుందని ఎన్నడూ వూహించలేదు. విశ్వాసఘాతకీ, వంచకురాలైన భార్యా ముహం యింకెలా చూస్తాడు? జంతువులూ, పక్షులూ మగజాతిమీద ఆడజాతి చూపించే విశ్వాసం పెళ్లాం తనమీద చూపించలేకపోయిందే! తప్పిపోయిన పోతు పావురం కోసం పెంటి ఎంత రోదిస్తో వెతుకుతుంది?

## ధనశ్రీ

ఈనాడు తన కళ్ళతో చూసింది ఎలా మర్చిపోగలుగుతాడు? కొరివితో తన కళ్లను కాల్చుకున్నా ఆ దృశ్యం తన హృదయంలో మెదల్తూనే వుంటుంది. చెవుల్లో సీసం కరిగించి పోసుకొన్నా రవణమ్మ పరాయి మొగాడి వళ్ళో పలుకుతూ అన్న మాటలు చెవుల్లో గింగురు మనకుండా వుంటాయా?

క్షణం క్రితం జీవితంలో తను సాధించిన విజయం తాలూకూ ఆనందం, వెలుగూ ఆనందరావు హృదయంలో ఆరిపోయింది. ప్రపంచంలోని చీకటి - ఆ చీకట్లో రవణమ్మ - దాని ప్రియుడూ—వాళ్లు చేసిన నీచం, అన్యాయం ఆనందరావు హృదయంలో పేరుకుపోయింది. హృదయంలోని బాధ, వ్యధా తీరే మార్గ మేమిటి? ఎవరితో నన్నా చెప్పుకొని వుపశమనం పొందేదయినా కాదే?

జీవిత ఆశలన్నీ భగ్నమయినై. ప్రేమించి విశ్వసించిన రవణమ్మ తన్ను మోసం చేసింది. ఇంకెవరికోసం బతుకుతాడు? దేనికోసం బతుకుతాడు. జీవితంలో తనకు రాసిపెట్టింది యింతేనేమో?

ఆనందంతో, వుత్సాహంతో అత్తారింటికి వెళ్లిన ఆనందరావు ఆరాత్రే వెనక్కు తిరిగి విశాఖపట్నం రైలెక్కాడు మాయలేని నిస్పృహా, నిరాశలతో.

జీవితంమీద విరక్తి పుట్టిన ఆనందరావు పిచ్చి వూహాల్తో, వెర్రి ఆలోచనలతో రైల్లో వో మూల కూర్చున్నాడు. తెల్లవారుఝాము నాలుగు గంటలకు ప్యాసింజరు నెల్లూరు చేరుతుంది. అక్కణ్ణించీ వో ఐదు నిముషాల్లో పెన్నానదీ; నదిమీద బ్రిడ్జీ! బ్రిడ్జీమీదగా రైలు!

ఆనందరావు చేతి వాచీ చూసుకొన్నాడు. రెండుంబావయింది. ఇంకో గంట ముప్పావులో యీ నరకంనుండి యీ బాధ నుండి విముక్తుడవుతాడు.

జీవితంమీద విరక్తి పుట్టినవాళ్లంతా ఏం చేస్తారు? అదే తను చేస్తాడు. కట్టుకొన్న పెళ్ళాం వంచకురాలు, ద్రోహి అయితే మగవాడేంచేస్తాడు? పెళ్లాన్ని ముక్కలు ముక్కలుగా నరికి పోగువేస్తాడు. దాని ప్రియుడి తల బద్దలు కొట్తాడు. ఆ రెండు పనులూ తను చేయలేడు. తనది సంస్కారంగల హృదయం. అభిమానవంతుడు తను. పెళ్లాంమీద కసి తీర్చుకుంటాడు. అయినా తను చూసింది - తన కళ్ళతో చూసింది, చెవుల్తో విన్నది ఎలా మర్చిపోగలుగుతాడు? మళ్ళీ ప్రపంచంలో తను తలెత్తుకొని ఎలా తిరగ్గలడు? ఆనందరావు పెళ్లాం ఫలానా వాడితో—అంటుంది లోకం. తను వినలేడు. విని సహించలేడు. తను చనిపోయినా లోకం ఫలానా ఆనందరావు పెళ్లాం —అంటుంది. కాని, ఆ మాటలు విని బాధపడటానికి ఆ ఆనందరావు వుండడు. పాపం! ఆనందరావు అభిమాని. కుచ్ఛితమైన మనిషి. పాడుముండ రవణమ్మ అతడి వుసురు పోసుకొంది. అంటారు లోకులు. తప్పకుండా అంటారు! రవణమ్మ మొహం మీద దోవనపోయేవాళ్లంతా తలా కాస్త

(49-వ పేజీ చూడండి)

# ఏకత్వంలో అనేకత్వం

ఘట్టి కృష్ణమూర్తి

[ఒక నాటి సాయంకాలం ఊరిబయట కాలవగట్టుమీద కూర్చుని ఏదో చిరాగ్గా ఆలోచించుతూ వుంటాడు పంతులు. కొంత సేపటికి శానయ్యా, విస్సన్నా, మరి కొంత సేపటికి ప్రతినిధీ,—అక్కడకు జేరుకుంటారు.]

శా: ఏదో ఆలోచిస్తున్నా వేమిటయ్యా పంతులూ?

పం: ఆఁ...ఏం చావమంటావ్? ఇంత సేపణ్ణించీ నేనీ కాలవగట్టున తల పగలగొట్టుకు చస్తుంటే వొక్కడైనా అడిగినవాడున్నాడూ?

శా: నామట్టుకు నేను నీతో యేనాడు కలియలేదు చెపుదూ? చేతనైనంతవరకూ సమిథలు విసురుతూనే వున్నాను గదా!

పం: అయినా వొక్క చేతిమీదుగా యేమి నెరవేరుతుంది? కావలసిన కార్యం కొండంత నెత్తిమీద పడింది, మోసేవాడెవడు? నాకు వెనక వత్తాసువుండాలే గాని ఒకొక్కణ్ణీ పల్లకీ బొంగులా వొంచేయనూ? అష్టమైన వాళ్ళూ పైకిపోతూంటే లేని హక్కులన్నీ - అసలు ఉండకూనిడవన్నీ - పుష్కలంగా అనుభవించేస్తుంటే, అన్నీ తెలుసుకున్న మనం యిలా చేతులు ముడుచుకూర్చోవడంలో అర్థమేవిఁటంటావ్?

శా: అలా యెందు కూరుకుంటామయ్యా! నీ పిచ్చికాకపోతేనూ? మనకు అన్యాయంగా తోచిన ప్రతివిషయాన్నీ జంకూ-గొంకూ లేకుండా బైటపెట్టేయాలంటాను. ఇలా చాటునా, మాటునా గుసగుసలాడడం వల్ల ప్రయోజనం శూన్యం. అడుగో మిత్రుడు విస్సన్న ఇటేవస్తున్నాడు-అసలు సంగతి ఆలోచించుదాం!

పం: అసలీయనకు బుద్ధివుంటే వ్యవహారం యింతవరకూ వచ్చేదేకాదు. అదేదో గుట్టుచప్పుడు కాకుండా చేసివుంటే వాళ్ళింత పేట్రేగేవాళ్ళా? ఇంత సులువుగా వల్లేరుమీద బండీ నడిచేదా?

వి: పంతులుగారేదో ఘాటుగా విసిరేస్తున్నారు?

పం: ఆఁ...విసరక?—, నీలాంటి ప్రబుద్ధుణ్ణి పక్క కాపరం పెట్టుకున్నందుకు చప్పుడుకాకుండా చెంపలు వాయించుకుంటున్నాను.

వి: శివశివా! ఎంతమాటన్నారు! నా మూలాన మీకెంత అవమానం జరిగిందం యీక్షణంలో దమ్మిడీ విషం తాగి చచ్చిపోతాను.

శా: చచ్చి సాధించేదేవిటయ్యా వెర్రివాడా! అసలు మనమేమీ తనతో సహకరించడం లేదంటారు పంతులుగారు, దానికి తగిన సమాధానం చెప్పగలవిధంగా కార్యాచరణలో చూపించాలిగానీ, - ఏదీ వొక్క బీడీముక్క ఇలా తగలెయ్యి!

పం: ఎంత లేదన్నా మనం చదువుకున్నముండావాళ్ళం!

వి: అవును.

పం: ఆసంగతి ఊళ్ళోవాళ్ళు గుర్తించి మననెత్తిన ఏదో పెట్టలేదనే అసంతృప్తి యెందుకుండాలి?

శా: నన్నడిగితే అది పొరపాటే అంటాను. మనల్ని మనం గౌరవించుకోవడం తెలిశాక యెదటివాళ్ళని అంటే అందం వుంటుందిగానీ...

పం: గౌరవంగోడ గడ్డయాను. అసలిక్కడ మన అస్తిత్వానికే భంగం రాబోతూ వుంటే, యింకా గౌరవమంటూ అఘోరిస్తావేవిటయ్యా! వొపక్కనించి టోపేరం లేవగొడుతుంటేనూ! - ఏ అర్ధరాత్రో బుర్ర రామకీర్తన పాడితేగానీ తెలియదు.

వి: అందుకే యీలోగా మనం చేయవలసిందేదో చక్కబెట్టుకోవాలంటాను.

శా: అది నెరవేరాలంటే ఉత్సవవిగ్రహాల దగ్గిర్నుంచీ గుడిలో గురప్పదాకా పులిగాపు చెయ్యాల్సిందే, చిలుం వదల్చాల్సిందే -

పం: అందుకే నేనీ కాలవగట్టున తలపగలగొట్టుకు చచ్చేది. వట్టి ఆవేశంతో పనులౌతయ్యా? వాళ్ళకి పెద్దపడి మణుగున్నర పశుబలంవుంది. గిద్దెడునీతితో యేవిటయ్యా నువు గిలకరించేది? మనం చేయబోయే వ్యవహారం కుక్క కాటుకు చెప్పదెబ్బలాగుండాల్సిందే!

:శా మనమూ ఆ బలమే ప్రయోగించాలంటావా?

పం: మనకైతే అంతబలం యెందుకు? కుండంత సొరకాయా, కత్తిపీటకు లోకువంటారు అంతే -

వి: అయితే ప్రస్తుతం మన ఆయుధం యేమిటంటారు?

పం: అవసరాన్నిబట్టి అడ్డమైనవాటినీ స్వీకరిస్తాం, కంచే చేను మేసేవిధానం కట్టడేదాకా - రామ రామా, తల వాచిపోతోందంటే నమ్ము శానయ్యా!

శా: నిజమే మరి, అందరం వొకసంస్థలో పనిచేస్తున్నప్పుడు హక్కుభుక్తాలు సమానంగా వుండాలిగాని, - ఒకరికి వర్తించిన రూల్సు, ఇంకొకరికి వెగటుగా తోచడం, ఒకరిమీద పుష్పాలు, ఇంకొకరిమీద బాష్పాలు, ఒకరిమీద కటాక్షం, ఇంకొకరిమీద నిటలాక్షం—ఇవన్నీ యిలా కొనసాగిననాడు అసలు సంస్థ ఉనికికే ముప్పు వస్తుందంటాను, ఏమంటావ్ విస్సన్నా?

వి: నే నెవ్వరిమాటా కాదనను, కాకపోతే నా అభిప్రాయంలో మన విధానం యెలా గుండాలో నిర్వచించుతాను, అంతే.

పం: ఒక్కమాట, అభిప్రాయాలకూ, ఆచరణలకూ పొంతన కుదరకపోతే అందరూ యేకమై మనకు తాటాకులు కట్టేమాట ఖాయం.

వి: అబ్బే...అలా గెందుకు చెబుతాను? 'చాపకింద నీళ్ళలాగ, సాగే నీడల్లాగ ఉన్నట్టే ఉండి గమ్మున క్రమ్ముకుపోవాలి' అంటాను.

పం: బాగు! బాగు!! అందుకే నిన్ను పక్కన పెట్టుకున్నానయ్యా! విశ్వకర్మ నిర్మాణానికైనా వంకలు పెట్టవచ్చుగాని నీప్లాను నిస్సపత్నంగా సాగిపోవలసిందే - మరొక్కమాట, నోటి తొందరతో పుసపుసా యెవరిదగ్గిరా వాగకూడదు, మన సంకేతాలు - అందులో 'సందర్భం' అనే మాటకున్న విలువ నాలుక పీక్కుచచ్చినా, మరొకడి చెవిని బడకూడదు. ఆఁ..సమయం వచ్చింది కనక అడుగుతున్నాను, నువ్వీలోపల యెన్ని సందర్భాలు చేశావో చెప్పు! మనలో మన మాటలే.

వి: అందుకే నేనూ చెబుతున్నా - నవంబర్లో మూడు, డిసెంబర్లో రెండు, అవసరం కొద్దీ జనవరిలో ఒకటి.

పం: నువ్వు కాబట్టి 'టాలరేట్' చేసి వూరుకున్నాను. అదే మరొకడైతే డొక్క చించెయ్యక పోయానా? మన చేతిలో అధికారం లేదన్నమాట గానీ...

శా: సరే—మనదగ్గర కొచ్చేసరికి శ,ష, ళి, ష లు శాపనార్థాలూ యెందు రాతల్యెందుకు? ఆ పని' వారు చేసుకొంటే, ఆమాత్రం 'ప్రివిలేజి' సోదరులు అనుభవించకూడదా, అంటారు. ఆ గొంతే మనమంతా పట్టి 'రోగ్స్' అని వాగుతూ వుంటుంది.

పం: అవునయ్యా కానయ్యా! ఇది నీకంత తేలికగా అర్థమౌతుందనే? సంఖ్యాబలాన్ని అధికార బలంతో జోడించి అందర్నీ అకట్టుకోవాలనే దుర్బుద్ధి ఏనాడు కలిగిందో, అప్పుడే యీ యాదవ కులంలో ముసలం పుట్టిందనుకో! మనమంతా వొకచేనని పైపైకి పూసుకు తిరుగుతూ వుండగానే సరిపోయిందా? ఊకనిప్పులా లోపల్లోపల కుమలడం లేదూ?

వి: మీ మాట కడ్డొస్తున్నాను — అధికారంకోసము, 'ఎగ్జిబిషన్'కోసమూ కాకపోతే వీరు చేసే కార్యాలన్నీ సంస్థను బాగు చెయ్యడానికే నంటారా? తమలో వున్న అసమర్థతను కప్పెట్టుకోడానికి అన్నింటిలో వున్నామంటూ వేలెట్టి అడ్డమైన భామ వేషాలూ ఆడుతూ వుంటారు ఈమధ్య బొత్తుగా యిది వొక నాటకరంగమైన దనుకోండి!

పం: మంచి పోలికే చెప్పావ్ గానీ విస్సన్నా! దానికి యింకొకటి కూడా జేర్చాలి! సూత్రధారుడు లేని, ఉన్నా నడిపించలేని పట్టి 'నాటురంగ'మంటే బాగుంటుంది కాదు?

శా: ఆఁ...పంతులుగారు భావం పట్టెయ్యడంలో మహా ఘనులే! దొరకాలే గాని లటుక్కున వేసుకోరూ? చేతైతే తన పని తాను చేసుకోవాలి, తెలిస్తే నాలుగు ముక్కలు చెప్పాలి. కాని, అన్ని వ్యవహారాలూ తమకే కావాలని అకట్టుకు తిరగడంలో అర్థమేవిటంట?

పం: అర్థాల మాట అలా వుంచు! మన నెత్తిన పెద్ద అనర్థం వచ్చిపడింది కాదటయ్యా! దానికేంగాని మన ప్రతినిధి ఇడుగో వస్తున్నాడు. అసలు సంగతి బైటపడుతుందిగా...రావయ్యా, రా! కొంప



గోపాలుడు

చిత్రకారుడు: పి. నాగేశ్వరరావు, పెల్లభాపురం.

## అగ్నిమిత్రుడు

కొత్తగా కాపరానికి వచ్చిన భార్యకి ఒకరోజు జ్వరం వచ్చింది. భర్త తానే పొయ్యి రాజేయవలసి వచ్చింది. వంటయింట్లోకి వచ్చి అగ్గిపుల్ల మీద అగ్గిపుల్ల గీసి ఎన్నిమార్లు అంటించినా కుంపటి అంటుకోలేదు. అతనికి ప్రాణం విసిగింది. గబగబా జేబులోంచి సిగరెట్ పెట్టె తీసి, ఒక సిగరెట్ వెలిగించి, నివ్వా పుల్ల గిరాటువేశాడు.

నడిమింట్లోకి పోయి కుర్చీ మీద కూర్చొని సిగరెట్టు సాంతం కాల్చి నిట్టూరుస్తూ వంటయింట్లోకి తిరిగివచ్చాడు. వచ్చి చూస్తే వంటయింటి నంతటినీ పొగ చుట్టేసింది. కుంపట్లో బొగ్గులు కణకణ మండుతున్నాయి. అతడు బ్రహ్మానందం పొందాడు.

సిగరెట్ వెలిగించుకోవటం కోసం గీసిన అగ్గిపుల్ల ఆర్పకుండా మూలనున్న దూది బస్తా మీదికి విసిరాడు. దూది బస్తా పక్కనున్న కొబ్బరిపీచు బుట్టకీ, అక్కడినుంచీ దాని పక్కనున్న కిరసనాయిల్ సీసాకీ, అట్లా అట్లా పాకి మన అగ్ని ఆఖరికి కుంపట్లో బొగ్గుల్ని కూడా రాజేసింది.

# ★ ఏకత్వంలో అనేకత్వం ★

లంటుకుంటూంటే గొయ్యి తవ్వాడట నీతోటివాడు. వోచెంప యిక్కడ ఇలా పతమతమై చస్తూంటే ఇస్త్రీమడత నలక్కుండా నడుస్తావేం?

ప్ర: చెప్పదగిన మార్పు అంతగా లేదు, రాత్రి మనం అనుకొన్నదే ఖాయమయింది.

పం: నేను చెప్పలా, 'కటికవాడి చేతిలో కంఠాలు, కలవకొడలు ఒక్కలాగే తెగిపోతూ వుంటయ్యా'ని - కలంపోటు పొడిచాడన్నమాట! ఇంతకీ విస్సన్న కొంపకి తిప్పలు తెచ్చాడు, ఈ తడవకూడా యేదో సందుకాళీని కెమేరా 'క్లిక్' అనిపిస్తే పోయేదికాదూ! వీళ్ళ అంతేమిటో, కుండ దాకు వసరుదాకా వళ్లగించే వాళ్లం.

వి: నన్నడమే కాని ఆ పుస్తకం మన చేతుల్లోకి వచ్చే విధానమేది?

పం: అదీ నిజమే మరి! అసాధు 'ఇన్ ఛార్జి' వాకు తగలడలేదు. అసలు నాచేతిలోనే వుంటే యింత యౌగంధరాయణం యెక్కడ జరగనిచ్చేవాడిని? ఎంత సాహసి కాకపోతే బుడ్డోడు పిరా ఛల్లు మనిపించి, చెయిజారింది క్షమించమంటాడా? ఆ వొక్క మరక చాలు ఎన్ని చీకటితప్పుల నైనా కప్పెట్టుకోడానికి! అంతు కనుక్కోకపోతే యింకెన్నాళ్లయినా సాగుతుంది. సూత్రధారుణ్ణి మాపులగొడ్డుచేసి, ఇదంతా వట్టి నాటురంగం చేశారు. పదండయ్యా పోదాం! రాత్రికి గ్రహణంకూడానట! పెందరాళ్లే నాలుగు మెతుకులు కొరికి మా యావిణ్ణి కదలకుండా పడుకోబెట్టాలి!

రా: అయితే పంతులుగారి మరో టీపార్టీ దగ్గరపడిందన్నమాట!

పం: ఆఁ... దానికేం భాగ్యం లేవయ్యా! తల్చుకుంటే యేటా వొకటేడుస్తుంది!—.

[ఆ రాత్రికే ఒక గోడచాటున కొబ్బరిచెట్టుక్రింద రెండు గొంతులు, గుసగుసల స్థాయిలో మాటాడుకొంటూ వుంటయ్, కొంతసేపటికి మూడో గొంతువచ్చి కలుస్తుంది.]

రాజా: ఏమంటావయ్యా భట్టూ!

భ: అనేదేముందయ్యా రాజా!

రా: అయితే ఆ విషయాన్ని గురించి మువ్వే మాలోచించినట్టు?

భ: అందరూ అలాగే నంటే నేనూ దానికి 'సరే' అంటాను.

రా: అందరూ అవునన్న దానికి తల లూపడం కాదు మనపని, ప్రతివిషయంలోనూ - ఏదో వొక రూపాన మన ప్రత్యేకత ప్రదర్శించుకోవాలి!

భ: అవును - ఒకవేళ రేపు జరగబోయే మన మీటింగులో యీ విషయము, లోగడ విషయం కూడా ప్రస్తావనలోకి రావొచ్చు! అప్పుడు మనం అచ్చంగా వేరుగానే వుండిపోయి మాటాడడమా? లేక అందరమూ వొకటేనన్న భావం ప్రదర్శించి చూదామంటారా?

రా: అలా అనకపోతే చివరకు నెపం మనమీద వేసి అందరూ నవ్వి యేడుస్తారు! సాగినంతవరకూ సజావుగా నడిపించుకుపోవడమే మంచిది, క్రమం తప్పడమెందుకూ?

భ: అయితే వొక్కమాట! మనకాకుళం చేసిన సందర్భాల సంగతేవిటి? మనలో మాట, దీని విషయమై వాళ్లందరూ తల పట్లు పట్టుకుంటున్నారని వినికిడి.

రా: దానిమాట అలా వుండనియ్యి! మనం—కాకుళంతోసహా—అధికార వర్గానికి కొంత సన్నిహితంగా వుంటున్నామని' కొగల కొర్యాలు, వారితో సంప్రదించకుండానే సాహసించి, స్వతంత్రించి, చేసుకుపోతున్నామని మనమీద గుర్రుగా వున్నట్టుకూడా వినికిడి! దీనికంతకీ వొకటే మందు. మనపని మధ్యలో మానుకోకపోవడం, - ఇది సంస్థకంతకూ సంబంధించినదే కనక వారినికూడా కూడగట్టుకు రావడానికే ప్రయత్నించాం, కాని కలియ లేదని పైకి నటించుతూవుండడం, బాగుల్లా?

భ: అంతమాత్రమే చాలదు - మనం చేయించే ప్రతి పనికీ లెక్కలు చూపించమని వాళ్లు గొంతులు చించుకుంటూ వుంటారుగా, అందుకని మరికి పెత్తేడు ఎడంగా కొన్ని ఎకౌంట్లు తయారు చేయించి మీటింగులో చదువుదాం, అంగీకరించినట్లు అందర్నీ అడుగున సంతకాలు పెట్టమందాం, దానితో మరుకు బయటపడుతుందిగా!

రా: ఇది అంతకంటే బాగుంది, వలుగురి ముఖప్రీతికైనా సంతకం పెట్టితీరాలి, లేకపోతే అడుగున వొక మరా తగిలించుకోవాలి!—మరి డబ్బుకి సంబంధించినంత వరకూ లెక్కలభారం నీమీదనే వేశాను లేపట్లోగా సరిచూసి అట్టే పెట్టాలిమరి!

భ: అదెంత పని? ఇది నాకు లెక్కా? గోటమీద అంకెలువేసి చూపించుతాను.

రా: నాలుగు కాలాలపాటు ఇక్కడ వుండాలనుకున్న వాళ్లంగదా ఏదో తంటాలు పడినట్లు కనబడకపోతే 'పబ్లిక్ సింపతీ' యెలా కూడగట్టుకోగలం? పోతే

యిక కాకుళం సంగతి మిగిలిందన్నమాట! అతను చేసింది తొందర పని, లేక పొరపాటే అనుకుందాం. అయినా యెలాగూ కప్పెట్టుకోడానికి చూడాలిగా?

థ: ఇస్...ఆగండాగండి! ఆ బ్యాటరీ లైట్...ఇలా...చెట్టుచాటుగా...రండీ!

రా:...మరెవ్వరూ కాదు లేవయ్యా, మనవాడే!

థ: నేనూ అదే అనుకున్నాలే తరవాత. లేకపోతే అంత తొందరగా నడిచేవాళ్ళెవర్ని చూశాం యీ గ్రామంలో. ఎప్పుడు చూసినా యెక్కడో, ఏవో కొంపలంటుకున్నట్టే పోతూ వుంటాడు.

రా: అది కార్యశూరుడికి లక్షణంలే, ఒక్కటైతే అనుకోవచ్చు. తెల్లారి లేస్తే

# ★ ఏకత్వంలో అనేకత్వం ★

ఎన్ని వ్యావర్తులు? రావయ్యా! రా, నీమాటే అనుకుంటున్నాం.

కా: ఆఁ...ఏం బావమంటారు? ఇంటి కొచ్చి కూడు తినేసరికి యీ వేళ్లయింది. ఇప్పటికి పదకొండున్నర దాటింది. ఇంకా యింటికివచ్చి నిద్దర్లు లేపాలేమో అను కుంటున్నా.

రా: మాకుమాత్రం నిద్దరపట్టి చచ్చిం దంటావ్. సరే. మా రీహార్సల్ అంతా అయింది, నీదిమాత్రమే మిగిలివున్నది ఎలా సమర్థించుకుంటావో మరి?

కా: సమర్థించే దేముందీ! అదంతా ఇది వరకే 'మాయాబజార్, చేసేశాంగా!

రా: చేశావులే, ఆ పెసంమాత్రం నీమీద వుండడం కళంకం కాదూ?

కా: ఇటువంటివి లోంభై వస్తేమాత్రం మనకు లెక్కేంటి? మన సర్వీసులో యెంత మందిని చూశాం, యెన్ని చేశాం?

రా: ముందుగానే దౌర్జన్యానికి దిగడం అంత మంచిది కాదు. మన పాప్యులారిటీకి ముప్పు వస్తుంది అవసరమైతే 'అపాలజీ, కోరేటంతవరకూ మనం సంసిద్ధులమేనన్నట్లు నటించాలి! ఒకవేళ తొందరపడి మాట మిగిలినా, ఏ అర్ధరాత్రివేళ్ల అంతపనీ చేస్తే మాత్రం తప్పేమిటంట? ఎవరు చూడొచ్చారు? ఇటు ఇంటా, అటు బయటా మన పథకం పారుతుందిగా!

కా: మీరన్నదానికి కాదంటానా గురూ? మన సంస్థకి సూత్రధారు లెంతో మాకు మీరంత!

రా: ఇక యానివర్సరీ, చందాలమాట యెత్తుకుందాం, దానిని ఖజాన వేసుకుని గ్రామంలో తిరగటం నాకూ యిష్టం లే దనుకో! అయినా మన సిద్ధాంతం ప్రకారం ఆ మాట నూటిగా అంటామా?

భ: 'అచ్చే అసలాధారం పెట్టుకోవద్దు, మన మిక్కడె నిభాయించలే' మనే మాట వారి నోటివెంటనే వచ్చేట్టు చెయ్యాలి!

కా: అప్పుడు తెగేదాకా లాగి వదిలి పెట్టవచ్చు, 'టగ్ ఆఫ్ వార్' సరిపో యింది. అయినా మనం కొన్ని 'ప్రివిలేజస్' అనుభవిస్తున్నామని వాళ్లకింత కడుపుబ్బ యెందుకో!

రా: 'ప్రివిలేజస్' కంటే పలుకుబడి ప్రధానం సుమా! ఆ సంగతి మర్చిపోతే కొంపకి తిప్పలు తప్పవన్నమాటే!

కా: ఒక్క ఊరేగింపు పెట్టి 'జా' మ్మనిపించామంటే మన మెంత ఖచ్చితంగా పనిచేస్తున్నదీ, అనాడే గ్రామానికి అర్థ మవుతుంది!

భ: గ్రహణం కూడా సగం పట్టింది. ఇంకా యెందుకయ్యా మనం? పోదాం పదండి!

రా: ఏమైనా అవసరాలుంటే ఉదయాన కలుసుకున్నప్పుడు మాట్లాడుకుందాం!

[ఆ రాత్రే తెల్లవారుఝామున మూడు గంటలకు ఒక యింట్లో మూడు గొంతులు మాట్లాడుకొంటున్నయ్:]

పం: వింటున్నారుగా! గ్రహణ స్నానానికంటూ చెంబూ, చేంతాడూ తీసుకుని నూతిదగ్గరకు వెడదామని బయల్దే రాను. ఖర్మం బాగుండి బ్యాటరీలైటు మాత్రం తీసుకోలేదు. స్విచ్ నొక్కితే వాళ్ళూ తప్పుకునేవారు, మనకీ మాటలూ చెవినిబడేవి కావు. ఏమిటలా నిదానంగా వింటారు? మన కొంపకి యెసరు పెట్టారను కోండి! మన సాంకేతికపదం 'సందర్భం' అనేది యెలా తెలిసిందో గాని భట్టుగాడి నోటివెంటవస్తూండగా విన్నాను. మిగతా విషయాల సంగతి పట్టించుకోనేలేదు. ఎవ్వరో వీధి మొదట్లో దగ్గినట్టుంటే నూతి దగ్గరకు పరుగెత్తాను. ఒళ్లు కంపరమెత్తిన ట్లయింది; దురదగుండాకు పులుముకున్న ట్లయింది. వెళ్లి జపానికి కూర్చుంటే సాగి చస్తేనా? ఏవో నాలుగు తిట్టుకుని విస్సన్నను లేపి నీకు కబురంపించానయ్యా కానయ్యా!

కా: అరె! చాలా గడ్డుసమస్యేవచ్చిందే! ఎవరిద్వారా వాళ్లకు అందివుంటుందీ, అని. ఇకనించీ మన మాటల్లో, ఉత్తరాల్లో యెక్కడా దానిని వాడకూడదన్నమాట!

పం: ఇంకేముందీ? నోరు కట్టడిపోయి నట్టే కాదటయ్యా! ఎంతమందిలో వున్నా ఆమాటతో వ్యవహారం నడిపించుకుపోయే వాళ్ళం, అంతా వెర్రిమొహాలెట్టుకు చూసేవాళ్లుగాని అర్థం గ్రహించేవాళ్లం టావా?

వి: ఎలా తెలుస్తుంది? మనం యెంత పరి శోధనచేసి కనిపెట్టామంటారు?

పం: మరి ముందుగతి యేమిటి? దానికి తగినట్టు మరోకమాట వెతికేదాకా నాకు నిదరపట్టదు, జపం సాగదు, అన్నం సయిం చదు——

కా: వెతగాలి మరి!

పం: నువ్వేమంటావ్ విస్సన్నా?

వి: ఆలోచించాలి!

పం: అందుకనే యిలాటి వ్యవహారాల్లో మీ కింకా అనుభవం లేదంటాను. మాట వెనకమాట తరుముకొస్తుంటే, వెతగాలి, ఆలోచించాలి, అంటారేమిటయ్యా!

కా: అదేమిటంటారు?

పం: చూడండి! మనం పెట్టిన పేరు 'సందర్భం' అని కదా అదంత వినసొంపు గానూ లేదు, అర్థయుక్తంగానూ లేదంటాను. దానివెనకనే మరోకమాట వుంది 'సంగతి' అనేది. మొదటిది యెలాగా వెల్లడయింది కనక ఇప్పుడా అర్థం 'సంగతి' కిద్దాం, ఏమంటారు?

కా: బాగుంది.

వి: చాలా బాగుంది.

కా: పంతులుగారి బుర్ర పాదరసంలా పోతుందనుకో!

పం: చూడండి! తెలిసిందిలేవయ్యా నీ 'సందర్భం' అనేకంటే, తెలిసింది లేవయ్యా 'నీ సంగతి' అని కొంత సాగదీసి, మరికొంత నొక్కి అన్నామంటే వ్యావ

కోరికానికి దూరమూ కాదు మన అర్థమూ చెడదు, 'విస్సన్నా తెలిసిందిలే నీ సంగతి!'

వి: మరిప్పుడు మన కర్తవ్యం?

పం: నా బుర్రలో మరోక కుమ్మరి పురుగుకూడా తొలుస్తున్నదయ్యా! మాటలో బాటు మన చిద్విలాసాలుకూడా పని గట్టాగా? అని. ఖర్మం కాకపోతే 'నమ్మిన బంటు' అనుకోదగినవాడు బైట వొక్కడూ లేడుగదా! కానయ్యా, మన పకడ్బందీలో మనం వుండితీరాలి, యేదియేమైనా సరే.

శా: గడ్డిపరకల్ని కూడా యిటు లాగినందువల్ల యేమన్నా అవుతుందంటావా?

పం: వాళ్ళు పట్టి నిలకడ, నిజాయితీ లేని బుడగలు ఏదో కడుపు కక్కుర్తికి వచ్చారు, రేపీ పాటికి పోతారు, బాధ్యత యేముంటుంది? పైగా వో గాలికి అతుక్కోవడం, మరో గాలికి రాలిపోవడం — పట్టి ములగచెట్టుమీది గొంగళీ పురుగులు. కల్లో కూడా నమ్మొద్దు. కిశోరీగాడు మాటలోనే ఖూనీ చేస్తాడు. వాడు దగ్గరున్నా డా కాస్త తమాయించుకు మాట్లాడాలి. ఏమైనా సరే మనం నలుగురమే యిందులో కట్టకట్టుకు దిగాలి! కాకపోతే 'మీటింగు' మొదలైనవేమన్నా జరిగినప్పుడు మన తరఫున చప్పట్లు కొడితే వద్దు అనం—

శా: అయినా ప్రయత్నించి చూస్తాను.

పం: విస్సన్న నాతోనే వుంటాడు.

[ఉదయం ఆరున్నర గంటలకి మరొక యింట్లో]

రా: రాత్రల్లా ఆలోచించగా నా కొకటి తోచిందయ్యా భట్టూ!

భ: ఏవిటది?

రా: గడ్డిపరకల్ని కూడదీసుకున్నామంటే కనీసం వాళ్లు బయట కావ్యాపు కన్నా పనికొస్తారు కదా, అని.

భ: ఆ మాటా నిజమే. కాని మన మొక ప్లాను ప్రకారం వొకొక్కణ్ణే 'స్టడీ' చేసి మరీ చేరదియ్యాలి. ఏమైనా యివాళ్టి మీటింగు కేమీ లాభించదు!

రా: అంతమాత్రాన ఉపేక్షించి వూరుకోవడం మంచిది కాదు. వాళ్ళు మనతో చేరడం, చేరకపోవడం అనేది మన చాకచక్యం పైనే ఆధారపడి వుందంటాను.

భ: అయితే కావొచ్చు, ముఖ్యమైన విషయాలు వదలి దానికోసం మన బుద్ధిని కేంద్రీకరిస్తే అసలుపని మరుగున పడిపోతుందేమో...అని జంకుతున్నా.

రా: నీకా 'ఫిక'రెందుకయ్యా! లెక్కలు తయారైనయి గదా. ఆ భారం నామీద వదులు మిగతాది నేను చెప్పినట్లు కానియ్యి!

భ: అయితే యేమంటారు?

రా: నువొక్కసారి శ్రమ అనుకోక అందరినీ కలుసుకురావడం మంచిది.

భ: కాకుళం, అరగంటముందే నాతో వొక మాట అని వెళ్లాడు తానేదో పాలం పనిమీద పోతున్నానని, 'మీటింగ్' వేళకు అక్కడకు జేరుకుంటాననీను.

రా: అఘోరించకపోయినాడూ? ఇదంతా యెవరికోసం చేస్తున్నట్టు? వో చెంప మన

# ★ ఏకత్వంలో అనేకత్వం ★

ఇక్కడ ఒకళ్ళకు నలుగుర్ని పోగుజెయ్యాలనుకుంటుంటే ఉన్న వాడేజారుకోవడమా? అతగాడికి మరోపని బదలాయించా లనుకున్నాను. పట్టి 'యూస్ లెస్ ఫెలో.'

భ: ధాన్యం కేరమిచ్చాడట. ఇవాళ్నా, రేపూ ఆగితే ఫరతగ్గే సూచన లున్నయ్యాని మొన్నటి ధరవంతున బయాణా తీసుకోవాలని అన్నాడు.

రా: సరే నువుమాత్రం నీపని ముగించుకుని అన్నం వేళ్ళకల్లా ఫలితం నాకు జెప్పాలి.

భ: ఒకవేళ్ళ అది మనకు అనుకూలంగా లేకపోతేనో...

రా: గట్టిగా వుంటుందని నేనుమాత్రం అనుకోంటున్నానటయ్యా! అయినా ముందుగా నీ జ్యోతిషం యెందుకు?

భ: తరవాత విచారం వుండదుకదా. అని - ఇంతెందుకు, అసలు సంగతి చెవుతాను. ఇంతకుముందే మనం కలవాలనుకుంటున్న వాళ్ళల్లో యిద్దరు కానయ్య వెంట వెడుతూవుండగా చూశాను. ఇప్పటికి మనం విరమించుకుంటే...

రా: అయితే అసలు మానను. నేనే వాళ్లకు వచ్చ జెపుతాను. నువ్వీ లెక్కల కాయితాలు తీసుకుని మాయింటికి పద!

[అరగంట తరవాత 'గడ్డిపరకలు, అనుకొన్నవాళ్ళల్లో నలుగురు ఒక తుమ్మచెట్టుక్రింద యీ తీరున మాటాడుకుంటున్నారు]

2: కోడికుయ్యగావచ్చి లేపాడుకానయ్య!

3: అసలేమంటాడు?

1: అనేదేమున్నది? ఇవాళమధ్యాహ్నం మీటింగ్ జరిగినప్పుడు తమతరఫున వెనకనించి చప్పట్లు కొట్టమంటాడు. అంతేనా?

4: అతగాడిని అనుకొని లాభమేమిటి? అదంతా పంతులుగారి పంపకమే.

2: కావొచ్చు, అయినా మన మొకవిధానముంటూ నిర్ణయించుకోవాలిగా మరి?

4: మన కొక విధానము, సమాధానము ఏవిటయ్యా! ఇవ్వాళవుండి రేపు పోయే వాళ్లం!

3: కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకోపమూను.

1: అబోతులమధ్య లేగదూడల్లా మన మెందు కిందులో పాల్గొని భంగపడాలి?

4: కాదుగానీ, యీనాటి యీసంస్థల్లో యింత కుళ్లు ఉన్నదని కాలేజీలలో కమ్మని జీవితం గడిపిన మన కేమర్థమాతుందోయ్?

2: ఈ పెద్దమనుషులంతా, రోషాలతో, కావేషాలతో అసలు విధులన్నీ గుంటబెట్టి గంట వాయించుతున్నారు, దేశానికి ద్రోహం చేస్తున్నారంటాను.

3: వీరందరికీ వొకటే జాడ్యం పట్టుకున్నది భాయీ? పదవి విలువ చూదామా, టోపా గుమాస్తాకున్నంత లేదు. సంవత్సరాని కొకసారి మార్కుల వేటలో దౌర్జన్యం చేసేవారేతప్ప ఉత్తప్పుడు మొహంజూసేవారుండరు, ఏదో విధాన ఊళ్లో 'పాప్యులారిటీ, సంపాదించి ఒక తలగల మనిషిగా బ్రతకాలని యిన్నిపాట్లు పడుతూవుంటారు. అందులోనూ వొకచోట నాలుగేళ్లు గడిచిందంటే అడ్డమైన పొలిటిక్సూ, వారికే కావాలి.

4: ఖర్మంగాలి బి, ఇడి, చదివితే, నువ్వూ వారిలో వొకడవు కావలసిందేగా! ఇప్పట్నించీ ట్రైనింగ్ అవు!

3: నిజంగా ఖర్మం కాలిందన్నమాటే! మామగారు ద్రోహం చెయ్యకపోతే యీ పాటికి యమ్. ఏ. అయ్యేది కాదూ? ఈ రెండేళ్ళనించీ యిక్కడ యీ తీరున మొద్దుబారడమెందుకూ? కొండయ్యతో 'ట్యూషన్లో భాగం కలిసి డబ్బు వసూలు కాక అఘోరించడ మెందుకు??

1: కాదుగానీ, మనవాడు ఇట్టేవచ్చి పిల్లల్లో పలుకుబడి సంపాదించాడని తల నెరిసినవా రందరికీ మహా గుర్రుగా వున్నదనుకో!—వారి పొలిటిక్సు, సంగతి మన కెందుకుగానీ, స్త్రహూ విదేశాంగ విధానం లాగ తటస్థంగా వుండడమే మెరుగంటాను. వారి మెప్పు సంపాదించకపోతే మనకు రాబోయే ఇంక్రిమెంట్లు ఆగిపోవు, హెడ్ మాష్టరు గిరీకి, కాలదోషం పట్టదు, అనవసరంగా యీ రొంపిలో దిగబడడం దేనికంట?

3: అడుసు తొక్కనేల? కాలు కడగనేల?? ఈ పచ్చీసులో పావులు కావడం మనకెందుకోయ్?

2: ఏదో వొక యాక్టవిటీ, చూపి 'గుడ్' అనిపిస్తే యీవూళ్లో కొంత రికార్డు మిగిలి వుంటుందిగా!

4: ఈ రికార్డులు, సర్టిఫికేట్లతో నాలుక గీసుకుంటామా యేవిటి?

2: మరీ అంత చేవచచ్చి మాటాడతావేవిటయ్యా, వచ్చే యానివర్సరీకి మనమొక నాటకంవేస్తే ఒక్క దెబ్బని అందరూ నోళ్లు తెరిచెయ్యరూ?

1: రచయితవు నువు కాదుగదా!

2: అవసరాన్నిబట్టి ఆ భారం మనమీద వేస్తే కాదంటామా?

3: అయితే మనవారి యోగంథరాయణమే వొక కథావస్తువన్నమాట!

2: ఇంతకీ యేంజేద్దామంటావోయ్?

1: చెట్టుమీది చిలకల్లాగా చూస్తూ వుందామంటాను.

3: గుట్టూ, మట్టూ తెలుసుకోవాలంటే అదే మంచిదంటాను.

2: రాజావారికేటే వేం చేస్తున్నట్టున్నారు, ఉచితాసనం వెతగాలి పదండి!

1: వారి మీసాలకు సంపంగినూనో?

3: సరే పదండి! ఉచిత సమాధానం కూడా తయారయ్యే వుందిగా!—

[ఆనాడే తొమ్మిది గంటలప్పుడు ఒక యింట్లో]

పం: ఏది యేమైనా సరే కంచే చేను మేసేవిధానం కట్టడేదాకా మన వైఖరి మార్చుకోకూడదు. మోకాలు అడ్డుపెట్టినంతమాత్రాన జరిగేవన్నీ ఆగిపోతయ్యా అంటావూ? పట్లేరుమీద బండీలా వ్యవహారం నడిపించుకు పోవాలనుకునే కొందరి గొంతుల్లో పచ్చివెలక్కాయ పడకమానదు. నామట్టుకు నాకంతే చాలు! నువ్వేమంటావ్ కానయ్యా?

కా: మన పథకం పారడమంటూవస్తే అంతటితో ఆగదంటాను. తమదే రాజ్యమనుకుని జబ్బలుచరుచుకొనే వారంతా అత్తపత్తిచెట్టులా ముడుచుకుపోరూ?

వి: దేనికైనా విత్తనమునేది వొకటి మన హయాంలో నాటితే అదే వేళ్లుపాతుకుపోతుంది!

పం: బాగా అన్నావ్! అంతవరకూవస్తే మనం వదులుతామా? ఏదో సందువాలీనీ కొరడితీసి కంచె అంటించమూ? సరేగాని విన్నవా! నువికముందు సందర్భాలు మొదలెట్టావా, మన పోరాటమంతా వృథా అవుతుంది. తాటాకులు కట్టి తోక కు నిప్పెడతారు సుమా!

వి: అంత అవసరమైనా మీ యెరుక లేకుండా జరగదని హామీయివ్వగలను.

పం: ఏడ్చినట్టేవుంది!—ఇవాళ గ్రహణ తూల కావడం, ప్రయాణానికి భంగం కలగడం అదీ మన మంచికే అనుకుంటాను. మధ్యాహ్నం 'అమే తుమే' తేల్చుకునే పోతాను.

[ఆనాడు మూడు గంటలకి స్టాఫ్ మీటింగు ఏర్పాటవుతుంది. సూత్రధారులు అధ్యక్షత వహిస్తారు.]

సూ: అయ్యా మన మిప్పుడు ఎందుకు సమావేశమైనామో రాజాగారు సెలవివ్వబోతున్నారు, అందరూ వోర్పుగా వినవలెనని నా ప్రార్థన!

పం : తమరేమీ అనకుండావుంటే నే నొక్కమాట అడుగుతాను.

సూ : తప్పక అడగండి!

పం : ఇప్పటి సమావేశంలో సంస్థకు సంబంధించిన అందరూ పాల్గొన్నారు, అవునా?

సూ : అయ్యో, నేను కాదంటానా? ఒకరిద్దరు సి.యల్. పెట్టుకున్నవారు తప్ప.

పం : అయినప్పుడు దీనికంతకూ పెద్దలైన మీరు బాధ్యత వహించి సంస్థను నడపవలసినవారు, కార్యక్రమ మేమిటో, విధాన మేమిటో నిర్ణయించాలి గాని, రాజాగారికొక కిరీటం తగిలించి పట్టం గట్టడంలో అర్థ మేమిటి?

సూ : ఈ విషయంలో మీరు దురభిప్రాయం పడకూడదు. నా దృష్టిలో అందరూ సమానమే. అయినా వారి కోరికపైనే యీ సమావేశానికి అంగీకరించాను.

శా : వారు కోరడం, మీరు అంగీకరించడం యిదంతా వొక ప్లానుప్రకారం జరిగినట్టు భావిస్తున్నాను, సోదరోపాధ్యాయులు నన్నిందుకు క్షమించాలి! మీరు పంపిన నోటీసులో ఆ ప్రస్తావన లేదు సరిగదా, కార్యక్రమం కూడా నిర్ణయించలేదు.

వి : శాస్త్రిగారి అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను.

రా : సోదరులారా! నా దొక మనవి! దురదృష్టవశాత్తు మనలో కొందరు భావించినట్టు యీ సమావేశానికి వెనకటి గ్రంథ మేమీ లేదని విన్నవిస్తున్నాను. కాకపోతే యీ సంస్థకు సంబంధించిన కొన్ని వ్యవహారాలు పైన వేసుకుని నడిపించుతున్నవాడిని కనక ఆ బాపతు లెక్కలన్నీ మీ ముందర ఉంచడానికే యిది యేర్పాటు జేశాను.

భి : దానిని ఆట్టే వివరించ నవసరం లేదనుకుంటాను. మనలో కొందరే మాతో సహకరించలేకపోగా కొన్ని అభాండాలు వేయడంకూడా నేనెరుగుదును అదీగాక...

పం : ఇక మీరు తగ్గండి! అన్యాయం అందరిమీదా రుద్ది, అధిక ప్రసంగం సాగిస్తున్నారు. సంస్థ సొమ్ములోనించి మీరు చేసినఖర్చులన్నింటికీ, అనుకున్నట్టు ఆమోద ముద్ర లభించడం కల్ల.

సూ : గౌరవ సభ్యులు ఉద్రేకపడడం పట్ల నా గాఢవిచారాన్ని ప్రకటిస్తున్నాను.

శా : ఆ...వీటికేమొచ్చె లెండి! కళ్ళల్లో విచారం, కడుపులో అపచారమూను. గుడిని మింగుదామనేవా రొకరైతే, లింగాన్నే మింగుదామనేవా రింకొకరు. ఇంతవరకూ విది సజావుగా నడిపించారంటారు?

సూ : గౌరవ సభ్యుడు కొంత తమాయించుకోవాలి!

వి : ఇన్నాళ్ళూ అలా అనుకొనే నోరు నొక్కుకొన్నాం. వీరందరూ ఇంతవరకూ బండీ నడిపించారు, కాని యెదటివారు మీరనుకున్నంత అజ్ఞానులు, అవ్యక్తులుమాత్రం కారని విన్నవిస్తున్నాను, మాకూ కొంత మానుషం యేడిపిస్తూనే వున్నది.

రా : ఆమాట కాదని యెవ్వ రనగలరు? ఈ సంస్థలోవున్న మనమంతా సమానహోదాలోనే మెలగుతున్నాంగదా!

పం : అయినప్పుడు దీని బాగోగులను గురించి మా కెవ్వరికీ లేని మమకారం మీకెందుకంట!

భి: ఎవరికివారలాగే వూరుకొంటే కాగల కార్యం కుంటుబడి పోతున్న దనే మేము కృషి ప్రారంభించాం.

పం : అంటే మేమందరమూ, సంస్థను సముద్రం పాలుచేసేవాళ్ళము, మీరు ఒడ్డెక్కించేవారూనన్నమాట! ఎంత దాచిపెట్టి బురిడీ చేదామనుకున్నా నోటివెంట యథార్థమే వస్తుంది!

రా : మేమేమీ గారడీ చెయ్యలేదు. గాలిలో మేడలుకట్టి మిమ్మల్ని అధిరోహించమనడం లేదు. ఉన్న యథార్థాన్ని వొప్పుకోడానికి సోదరుల కింత అక్కసెందుకో నాకు పాలుపోవడం లేదు.

శా : పాలూ లేదు, పెరుగూ లేదు. ఈ నేతిలో డాల్డా కలిసిందనే మా అఘోరింపంతాను.

రా : అయినప్పుడు నేను చెప్పింది విని లోపం యెక్కడున్నదో యెత్తిచూపవచ్చుగదా!

సూ : రాజాగా రన్నమాట సబబుగానే వున్నది. మొదటికే మోసం తేవద్దని గౌరవ సభ్యుని మరొకమారు కోరుతున్నాను.

(పంతులూ, శాస్త్రుల్లూ, విశ్వనాథ్, ప్రతినిధీ, యేదో చెవులో చెప్పుకుని మిన్నకుంటారు)

భి : ప్రస్తుతం రాజాగారు ప్రతిపాదించబోయే లెక్కల్లో. నాకూ కొంతపాలు వుండడంవల్ల మాటాడక తప్పలేదు. అసలు విషయం ఇది—మేమీ సంస్థ తాలూకు సొమ్ములోనించి తీసుకున్నది 550, అక్షరాలా అయిదువందల యాభైరూపాయలు. కాని దానిప్రకారం మే మనుకున్న అంచనాలు తారుమారు కావడం, అప్పటి మార్కెటురేటు ననుసరించి సిమ్మెంటు, ఇనుము మొదలైనవి సంపాదించడానికి అధికంగా వ్యయంచేయాల్సి రావడం జరిగింది కనుక దరిమిలా ఆ మొత్తానికి మరికొంత కూడా చేర్చాం. రెండు విధాలుగానూ

# ★ ఏకత్వంలో అనేకత్వం ★

లెక్కలు తయారయివున్నయ్. రాజాగారు వాటిని మీముందు పెడతారు.

రా (లెక్కలు చదివి, వివరించుతాడు)

సూ దీనిని మీరందరూ అంగీకరించుతున్నట్లు అడుగున సంతకాలు పెట్టాలని నా కోరిక. ఇది త్వరలో ముగించుకుంటే మిగతా 'యానివర్సరీ' మొదలైన విషయాలపై చర్చించుకోవచ్చు!

పం వివరణ పూర్వకమైన యీ లెక్కలకు అడుగులోనే హంసపాదు పడింది. పరిశ్రమన్ కోసం వెళ్ళిన పెద్దమనిషి ఆనాడు ఆఫీసరు ఊళ్ళో లేకపోతే, తిరిగి రావాలిగాని, తను గమోపాఖ్యానానికి, మాయారంభకు వెళ్ళి ఆ ఖర్చులన్నీ సంస్థ భరించాలంటే యెవ్వరు వొప్పుకుంటారు?

భ సోదరలు పొరబడుతున్నారు ఇది మా స్వంత పనికాదు అవసరాన్ని బట్టి ఆ మూడురోజులూ అక్కడవుండక తప్పలేదు

రా ఆఫీసరు ఏ క్షణంలో దిగుతాడో అని మా అదుర్దా.



పురి

ఫొటో: కె. వి. శివరామశాస్త్రి, పాలకొల్లు.

భ కాకపోతే ఆ ఖర్చులూ కొరిసగం మేము భరించుకుంటాం, అయినా అంత ఖచ్చితంగా మదింపు వెయ్యాలంటే యీ రోజుల్లో సాధ్యమా?

కా అడ్డమైన ఖర్చులూ వొప్పుకో మమ్మంటే కుమటుకు సాధ్యమా? తెచ్చిన సిమెంటు సరిగా జాగ్రత్త చెయ్యలేదు, అయిగు పంచులు గడ్డకట్టిపయ్యాన్నారు మరి ఏ గోతిలో వేసినట్లు? పంచులు తప్ప సిమెంటు కనబడదేం?

భ దానిని గురించిన వివరాలు కావాలంటే సోదరుడు ప్రైవేటుగా నాతో రావచ్చు

వి మాకు ప్రైవేటే అక్కర్లేదు పబ్లికే కావాలి!

ప్ర అయ్యా ఇది వొక ఇసుకపాతర అనుకోండి! తవ్వకున్నంతా వుంటుంది నామట్టుకు నేను చెప్పే సలహాయేమిటంటే ఈ 'అయిటం' మీటంగులోనించి వుపసంహరించుకోమని

భ అలాగైతే చాటు నా మాటు నా దుమ్మెత్తిపోస్తారు, ఎదట పెడితే వుపసంహరించుకోమంటారు దీని అంగీకారం మీదనే మన ఐక్యత ఆధారపడివుంది. దయచేసి సంతకాలు పెట్టండి!

కా అయితే కొన్ని 'షరా'లకు లోనై సంతకాలు పొడుస్తాం

సూ అదీ బాగానేవుంది ఎవరి,నిశ్చయం వారు చెప్పండి!

కా 'ఎకౌంటు చదువుకున్నారు' అని పెడతాను

వి 'ఇది నాకు అర్థంకాలేదు' అంటాను

పం ఇది 'అస్పష్టము, అసంపూర్ణము, అసంతృప్తికరము, అనాలోచితము, అవ్యక్తము——'అంటాను

ప్ర 'ఇది ఉపసంహారయోగ్యము' అని నా 'షరా'

ఒకరు సర్వం దైవాధీనమంటాను.

ఇంకొకరు నేనిక్కడ ఉండడం అశాశ్వతం ఇది నాకు పట్టదు, అంటాను

రా ఒక్క మనవి, మీ అందరి కోరిక ననుసరించి దీనిని ఉపసంహరించుకొంటున్నాను

సూ అయితే యిక వార్షికోత్సవం సంగతైనా తేల్చుకుందాం ఎవరిని అధ్యక్షులుగా పిలవాలి? మనం వేయబోయే నాటకాలు ఎట్టి సమస్యలకు సంబంధించినవై వుండాలి?? అనేవి రెండు సమస్యలు మనయెదట వున్నయ్ నాకూ యీగ్రామం క్రొత్త కనుక మీరు కొంత అధికంగానే పాలొనాలి! ఇందులో కృతకృత్యులమైనా మనిపించుకోవాలి!!

పం కృతకృత్యత యెలా గొస్తుంది

చెప్పండి! మనస్ఫూర్తిగా చేయనప్పుడు అంతా అతుకులబొంతే. కడుపులో లేనిది కౌగిలించుకుంటే వస్తుందా?

భ ఒక్కమాట! దీనిలో కూడా పోవరుసు పాక్షికంగా మాట్లాడుతున్నందుకు విచారిస్తున్నాను

వి పాక్షికం యెవరికి లేదు? వేపకాయంత వెర్రి తలగలవారందరికీ వుంటుంది

పం ఇప్పుడు, జరిగిందంతా మధ్య పెట్టాలంటే పొసగేపనా? బోడికి బొట్టు పెట్టినట్టు, పేడలో పసుపు రంగరించినట్టు పై పెరుగులు పెట్టగానే సరా?

శా నామట్టుకు నేను చెప్పాలంటే యీ జరగబోయే 'వార్షికోత్సవం' అనేది యెంత మాత్రమూ విజయవంతం కాదు, అని

వి అంతే మరి! దైనందిన పాలనలో దోసగులున్న తరవాత ఒక్కనాడు బాకా బజంత్రీలూది అన్నీ కప్పెట్టుకోవాలంటే జరిపనా?

రా అవన్నీ మనలో మనం సరిపెట్టుకోవాల్సినదేగాని రచ్చకెక్కినంత మాత్రాన వొరిగే దేమిటంటారు?

పం మనకు మనం రచ్చకెక్కకపోతే గోడకి చెవులున్నయ్యంటారా? ఇక్కడి వ్యవహారాలన్నీ యింటింటా యెవరు చాటారు? నూతులదగ్గిరా, చెరువులదగ్గిరా చర్చించుకొనేవారందరికీ దూరశ్రవణం, దూరదృష్టీ వున్నయ్యా?

భ ఎక్కడో యేదో చెప్పుకున్నారని ఉద్రేకపడేకంటే మనం కలిసికట్టుగా వుంటే అలాటి అసందర్భాలన్నీ యెదిరించగలం

శా ప్రతివారూ అమాటే అనుకుంటారు మరి! కళ్ళుమూసుకు పాలుత్రాగే పిల్లుల్లాగ!

పం చవుకగారే గోడలకు సిమ్మెంటు చేసినట్టు, రోగ నిదానం తెలీకుండా రోగికి మందెక్కించినట్టు, పుచ్చిపోయిన క్రరకు పొన్ను వేయించినట్టు, మనం చెయ్యాలనుకొనేదాంట్లో పటాటోపము, ఆడంబరము కాక మరేమున్నయ్యంట!

శా మన మిక్కడ ఆడేదంతా వొక పెద్ద నాటకం ఇంకా నాటకాలాడి యెవర్ని మోసగించుదామని?

ప్ర నాటకాలూ దొంగాటకాలూ, నాకు బొత్తుగా నచ్చవు, అత్తాకోడళ్ళ వరసంటే అంతకంటే గిట్టదు

భ ఈ సమస్యపై వోటింగు తీసుకోవడం సజావుగా వుంటుందనుకుంటాను

పం అంటే మీ కెవరిమీద కచ్చ వున్నదో వారంతా బహిరంగ పడాలనేనా మీ వాంఛ! ఈ ప్రజాస్వామికం పేరాపేగి వస్తే వుంది!

రా అలా యెన్నడూ కాదు, సమాన హక్కులు, సమానహోదాలు అనుభవించే వొక విద్యాసంస్థలో వొకరిపై వొకరు అవిశ్వాసం ప్రకటించడం ఆత్మహత్యలాంటిదంటాను

పం మనకు ఆత్మలంటూ తగులపడితే గదా! మనం చేసే యేపనిలో ఆత్మీయత అనేది పూరాగా ప్రతిబింబిస్తోంది? ఎవరి 'సంగతి' యెవరికి తెలియదు? ప్రతివారికీ వెనక నొక 'కలకత్తా చీకటికొట్టం'త వున్నది

రా అవును మరి కొందరు చేసిన 'సందర్భాలూ' కొంద రెరుగున్నారు

శా అందుకే మీ 'సంగతి' తెలిసిందనడం

భ వెనక బెంచీలో వున్న సోదరులు కూడా అభిప్రాయాలు ప్రకటించాలి

4 ప్రస్తుతానికి వారేదో రభసలో చిక్కుకున్నారు, అందురు క్షమించాలి!

మూ అయితే యీ నాటికి యింతటితో ముగించుకొని వచ్చే సమావేశం నాటికైనా మనమందరం కలియాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను!

మరో పనిలోకి రాకుండా సంతకం పెట్టడమే, యీ కథలో వాడిన 'సంగతి' 'సందర్భం' అన్న పదాలకు అర్థం ★

"ఇచ్చటినుండెచ్చటికో, తిరిగిరాక ఎప్పటికో" ఫోటో కె వి రమణమూర్తి, వెల్లటూరు



# దెయ్యాల కొంప

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

రామయ్య పంతులుకి చిన్నప్పుడు చదువు సమంగా అబ్బలేదు. అనేక వృత్తులుచేసి, చివరికి యుద్ధకాలంలో కంట్రాక్టు పనిచేసి బాగా డబ్బు గడించేడు. ఊరు చివర బ్రహ్మాండమైన బంగళా కట్టించేడు. బంగళా చుట్టూ విశాలమైన ఆవరణ. ఆవరణలో వెనకవేపు మామిడితోట. ముందు పువ్వులతోట. ప్రహారీగోడలు ఎత్తుగా కట్టించి, గోడలమీద గాజు పెంకులు తాపించేడు. ఇనప గజాల తలుపులు పెట్టించాడు. వీటన్నిటినీ దాటుకుని లోపలికి రావడం దెయ్యాలకు తప్ప మానవ మాత్రుడికి దుర్లభం

రామయ్య పంతులుది నల్లటి భారీశరీరం. కోరమీసాలు. ఎర్రటి కళ్ళు. చిన్నప్పుడు పెద్ద రౌడీ మరి తనంటే దెయ్యాలుకూడా హడలుకొడతాయని ఆయనే అంటూ వుండేవాడు నిజంకూడా అంతే. విద్యాగంధం లేకపోయినా స్వయంకృషివల్లనో, అదృష్టంవల్లనో లక్షరూపాయలు ఆస్తి గడించాడు. డబ్బున్నవాడికి దెయ్యాలు కూడా జడుస్తాయి.

రామయ్య పంతులుకి యిద్దరే సంతానం. ఒక కొడుకూ ఒక కూతురూను. కూతురు బంగారమ్మ బతుకు పాడైంది ఆరువేలు కట్నంపోసి చిన్నప్పుడే పెద్ద సంబంధం చూసి పెళ్ళిచేసినా రెండేళ్ళు తిరక్కుండా ఆ మొగుడు గుటుక్కుమన్నాడు. అత్తవారింటికి ఆమె వెళ్ళనేలేదు. రామయ్య పంతులు వియ్యపువారిమీద దావా తెచ్చి కూతురివంతు ఆస్తి పుచ్చుకున్నాడు. ఆమెకిప్పుడు పాతికేళ్లు దాటేయి కూతురు బతుకిలా అయిపోయిందని తల్లి నెత్తీ నోరూ కొట్టుకుని ఏడుస్తుంది. అంతకంటె యింకేం చెయ్యగలదు?

బంగారమ్మకిమధ్య దెయ్యంపడుతూంది. భర్తే దెయ్యమైవచ్చి ఆమెను పట్టుకున్నాడు. అదిమొదలు ఇంట్లో అన్నీ చికాకులే.

బంగారమ్మకు కీ మధ్య మళ్ళీ పెళ్ళి చెయ్యడంమంచిదని డాక్టరు మెల్లిగా సలహా యిచ్చాడు. కాని ఎలాగ? ఆమె విధవ. పిచ్చిదికూడాను. పెళ్ళిచేస్తేనే కాని పిచ్చి కుదరదు, పిచ్చి కుదిరితేనే కాని పెళ్ళి కాదు.

ఇది దెయ్యంకాదని డాక్టరంటారు. దెయ్యమని భూతవైద్యుడంటాడు దెయ్యమయితే యీ ఎత్తైన ప్రహరీ గోడలు, ఇనపగజాల గేటు దాటి లోపలి కెలా జొరబడింది?

రామయ్య పంతులుగారి ఏకైక పుత్రుడు నారాయణ అయిదోక్లాసుతో చదువుకు తిలోదకాలిచ్చాడు. చిన్నప్పటినుండీ రణపెంకిఇంట్లో డబ్బులు కొట్టేసి నాలుగేసి రోజులు యింటికే వచ్చేవాడు కాడు. పెద్దయాక కూడా అంతే. వాడికి ఊళ్లో చాలమంది స్నేహితులుండేవారు అయితే వాళ్లంతా ఏదో వొక వృత్తిచేసుకుని బతికేవారు వాళ్ళలో కొందరు జట్కావాళ్ళు, కొందరు బస్సుడ్రైవర్లు, కొందరు కిళ్లీకొట్లవాళ్ళు, కొందరు వంటబ్రాహ్మలు, ఇలాగే. నారాయణ వారి సహవాసంవల్ల అన్ని వృత్తులూ నేర్చుకున్నాడు. కాని ఇంట్లో యింత వున్నవాడు కాబట్టి ఏ వృత్తీ పట్టుకుని కూర్చోలేదు.

అయితే యీ వృత్తులు నేర్చుకోవడం అతడికెంతో లాభించింది తండ్రి వాడికి ఒక చిల్లిగవ్వకూడా యిచ్చేవాడుకాదు. కొడుకు తన కంటబడితే తిట్టేవాడు తల్లినడిగితే యిస్తుంది కాని ఆవిడదగ్గర ఎక్కువ వుండేదికాదు పావలా అర్ధా యిస్తే బీడీ ముక్కలకే చాలదు. ఖర్చుచూస్తే చాలా ఎక్కువ. సాయిబుల హోటల్లో కోడిగుడ్లు అట్లు, మాంసంగారెలు అంటే వాడికి మహాయిష్టం. పేకాట ఫస్టుగా ఆడేవాడు. ఇటువంటి నిత్యకర్చులకి కొంత డబ్బు అవసరంగదా! అందువల్ల వీలు చిక్కినప్పుడల్లా యింట్లో పదీ పాతికా కొట్టేసి రైలెక్కిపోయేవాడు. ఏదో వొక వూరువెళ్లి చేతిలో వున్నది కాస్తా కర్చుపెట్టేవాడు. ఆ వూళ్లో కొత్త స్నేహితులు తటస్థించేవారు. వారిని విడిచిపెట్టలేక అక్కడ బస్సు క్లీనరుగానో, వంటబ్రాహ్మడిగానో చేరేవాడు. కొన్నాళ్లకి అది విసుగుపుట్టి, స్వస్థలంలోని పాత స్నేహితులు జ్ఞప్తికి రాగా, మళ్ళీ రైలెక్కి తిన్నగా యింటికి వచ్చేశాడు.

"ఏటి పంతులూ, ఏటి ఇసేసాలు? కేంపెల్లి వొచ్చినట్టున్నావే" అని ప్రియమిత్రులు పలకరించినప్పుడు నారాయణకెంతో గర్వంగా వుండేది. "ఖరగ్‌పూర్ వెళ్ళి నిన్ననే వొచ్చానోయ్" అని అక్కడి వింతలు కొన్ని తెలియజేసేవాడు. అతని అదృష్టానికి స్నేహితులు యీర్ష్య పడేవారు.

కాని నారాయణకు మాత్రం ప్రస్తుత జీవితంమీద అసంతృప్తి జనించింది. మార్పులేని జీవితం అతనికి రుచించదు. అందుకే అతడు ఏ వృత్తినీ అంటిపెట్టుకుని వుండలేదు కారుడ్రైవరు, వంటబ్రాహ్మడు, కాఫీహోటేలు సర్వర్ ఎంత మార్చినా యీ వృత్తులే. దిక్కులేని బ్రాహ్మడెవడైనా చనిపోతే అప్పుడప్పుడు అతనిని వాహకుడిగా పిలుస్తారుకూడా. ఆ పని తమాషాగానే వుంటుంది ముందర అగ్నిహోత్రం వెళుతూంటే, వెనకాతల చచ్చినవాడి బంధువులు ఏడుస్తూంటే, బియ్యపుగింజలు, కాసులు విసిరినప్పుడు పిల్లలు వాటిని ఏరుకోడానికి కుమ్ములాడుకుంటూంటే ఆ ప్రొసెషన్‌లో "నారాయణా, నారాయణ" అంటూ శవాన్ని మోసుకెళ్లడం తమాషాగా వుంటుంది నారాయణకి కాని దానికి రోజూ ఎవరు పిలుస్తారు. ఎప్పుడో ఎవడో ఒకసారి చస్తాడు. ఆ పనికి గిరాకీ లేదు.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే నారాయణకి ఆ వూళ్లో జీవితంమీద విసుగు పుట్టింది. ఎప్పుడూ ఆ వృత్తులే ఆ స్నేహితులే. పేకాట, కసరత్తు, కుస్తీ, భజనలు ఎప్పుడూ అదే జీవితం. మార్పు వుండాలి. సినీమాల్లో జీవితం మంచి హుషారుగా వుంటుందని చాలమంది అంటారు నిజమే. సినీమా జీవితం ఎంత మజా! ఎంత తమాషా! అందులో నటులు, నటీమణులు, రాత్రిళ్లు షూటింగులు! అవుట్‌డోర్ షూటింగ్‌లు! మద్రాసు వెళ్ళి సినీమాల్లో చేరాలనే కోరిక నారాయణ మనసులో దృఢంగా నాటుకుంది. అయితే మద్రాసు వెళ్లడానికి

కొంత డబ్బు అవసరం! ఎలాగ? ఎవరిస్తారు?

రామయ్య పంతులుకి నారాయణమీద ఎలాంటి ఆశా లేదు వాడి గురించి ఎలాంటి చింతా లేదు. అయితే కూతురు బంగారమ్మ గురించి అతని మనసు బాధపడుతూంది. పాపం! బంగారమ్మ అమాయకురాలు! దానికి సుఖం లేదు! ముందు పిచ్చి కుదిరితే ఏదేనా సంబంధం చూసి మళ్ళీ పెళ్ళిచెయ్యవచ్చును భూతవైద్యుణ్ణి పిలిచి తావెజు కట్టించేడు డాక్టరు మందులూ ఇస్తున్నాడు కాని గుణం కనిపించడం లేదు పట్టిన దెయ్యం వదలకుండా వుంది రోజు రోజుకీ దెయ్యం ఇంట్లో మహా అల్లరి పెడుతూంది. చింతచెట్టుమీదనుంచి నిప్పులు రాల్చడం, బట్టలు కాలిపోవడం, సామాన్లు చిందరవందర చెయ్యడం, ఇలాగే. రామయ్య పంతులూ, భార్యా బెంగపెట్టుకున్నారు

ఒకనాటి రాత్రి ఇంటిమీద నాలుగు రాళ్లు పడ్డాయి దొంగలేమో అని వీధిలోకి వచ్చి చూశారు రామయ్యగారు. వీధిలో చల్లదనానికి వేసిన తాటాకుపందిరిమీద మరో నాలుగు రాళ్లు పడ్డాయి ఎవరో పెంకివెధవలై వుంటారని రామయ్యగారు యింట్లోకొచ్చి పడుకున్నారు. ఆరాత్రి మరి రాళ్ళు పడలేదు.

మర్నాడు రాత్రి పన్నెండు గంటలకి పడ్డాయి. ఈసారి వర్షం కురిసినట్టే పడ్డాయి. రామయ్య పంతులుకి భయం వేసింది "నారాయణా, ఒరే నారాయణా" అని కొడుకుని పిలిచేడు, నారాయణ పెద్ద చేపాటి కర్ర పట్టుకుని వీధి గుమ్మంలో నిలబడ్డాడు.

"మనుషులైతే యివాళ వాళ్ల నెత్తురు కళ్ళజూస్తాను కలేజావుంటే ఎదురుగుండా రండి ఎవరో" అని కేకలేసుకుంటూ నారాయణ యింటిచుట్టూ తిరిగేడు ఇరుగు పొరుగువాళు లేచివచ్చారు అందరూ ఆ చుట్టుపట్ల తిరిగి చూశారు ఎక్కడా మనుషులు కనబడలేదు. కాని మళ్ళీ నాలుగైగు రాళ్ళుమాత్రం పడ్డాయి.

అంతే, ఆ రాత్రికి ఎవరి మానాన్న వారు పోయి పడుకున్నారు.

మర్నాడు ఎందుకేనా మంచిదని రామయ్యపంతులు పోలీసులను తెప్పించి యింటిచుట్టూ కాపలా పెటంచాడు పందిట్లో గ్యాసు లైట్లు పెటంచాడు. పోలీసు సబ్ ఇన్స్పెక్టరూ, కొంతమంది జవాన్లూ పందిరిమధ్య నిలబడ్డారు ఊరిలో జనం వచ్చారు రాత్రి ఒంటిగంటైంది రాళ్లు పడ్డాయి. పందిరిమీదే పడ్డాయి. పెరటివేపునుంచి పడ్డాయని అటు వెళ్ళి చూస్తే వీధివేపునుంచి వచ్చిపడ్డాయి పోలీసులు ఎంత గాలించినా ఎవరూ కనపడరు

"మీ కెవరిమీదైనా అనుమానముందా?" అన్నారు ఇన్స్పెక్టరుగారు.

"అబ్బే, ఏమీ లేదు"

"ఇది చాలా విచిత్రంగా వుంది. ఎవడేనా మనిషి కనబడితే పట్టుకోగలం కాని." అనబోయారు ఇన్స్పెక్టర్ గారు.

"మనిషి కనబడితే మీరే పట్టుకోవాలేమిటి? కనబడితే యీపాటికి వాళ్ళ నెత్తురు కళ్ళగూడ్దును," అని గర్జించేడు నారాయణ చేతిలోని బాణాకర్ర గిర్రున తిప్పుతూ

"తగ్గవోయ్ పంతులూ.." అన్నారు ఇన్స్పెక్టర్ గారు నవ్వుతూ. ఆ రాత్రికి మరి పడలేదు. ఇది దెయ్యమే అయివుంటుందని రామయ్యపంతులుగార్కి, అందరికీ నమ్మకం కలిగింది తిరుపతి వెళ్ళి ఏడుకొండలవాడికి బంగారుకిరీటం చేయిస్తానని మొక్కుకుంది రామయ్యపంతులు భార్య

మన్నాడు రామయ్యగారు భూతవైద్యుణ్ణి పిలిపించేరు. ఇవాళ పందిరి పట్టపగలులా వుంది. పందిరినిండా లైట్లు పెట్టేరు. ఇంటినిండా జనం పందిట్లో జనం పందిరిమధ్య గిరిగీసి అగ్నిహోత్రం పెట్టి మంత్రాలు చదవడం ప్రారంభించేడు భూతవైద్యుడు ఒక కోడిపిల్లని బలియిచ్చేడు కొబ్బరికాయలు కొట్టేడు భూతవైద్యుడు నాలుగు ఖాళీ సీసాలు పక్కన పెట్టుకున్నాడు దెయ్యాన్ని అందులో దింపడానికి

మళ్ళీ పోలీసు ఇన్స్పెక్టరుగారు జవాన్లు పందిట్లో లాటీలు పట్టుకుని నిలబడ్డారు. నారాయణ బాణాకర్ర పట్టుకుని గస్తీ తిరుగుతున్నాడు

రాత్రి ఒంటిగంటైంది డభేలుమని ఒక రాయి పందిరిమీదనుండి అగ్నిగుండంలో పడింది. మరొకటి ఇన్స్పెక్టరుగారి కాని దగ్గర పడింది పందిరిమీద దడదడమళ్లీ నాలుగు రాళ్లు పడ్డాయి అంతా మామూలే

రామయ్యపంతులుగారి భార్య పెరట్లోకి వెళ్ళింది. అంతా కారుచీకటిగా వుంది. మొహం కడుక్కుంటే నిద్రమత్తు వదులుతుందని ఆవిడ నూతిదగ్గర కెళ్ళి బాల్టీ తీసింది నూతిగట్టు వొద్దునే కూర్చున్న ఒక మనిషి గాభరాగా లేచి నిలబడ్డాడు. ఆవిడ "అమ్మో" అని కేక వేసింది. ఆ మనిషి ఆవిడ నోరు మూశాడు. ఆవిడ తేరుకుని, ఆ మనిషి చెయ్యి పట్టుకుంది. అతని చేతిలోని రాయి క్రిందపడింది.

"ఓరి వెధవా, నువ్వట్రా, ఎంత దుర్మార్గుడివిరా" అంది ఆవిడ. నారాయణ తల్లి చెయ్యి విదిలించుకుని యింట్లోకి వెళిపోయాడు. ఆవిడకి ఏం చెయ్యాలో తోచలేదు భర్తతో ఏమని చెప్పాలో, యీ వచ్చిన జనాన్ని ఎలా సర్ది చెప్పి పంపించాలో, రేపటినుండి తను నలుగురిలో మొహం మెత్తుకుని ఎలా తిరగాలో ఆవిడకి బోధపడలేదు.

రామయ్య పంతులూ, తదితర జనమంతా వీధి పందిట్లో వున్నారు నారాయణ సరాసరి యింట్లోకి వెళ్ళి తండ్రి కోటుజేబులోని తాళాలు తీసి, కేషుపెట్టి తలుపు తెరచి మీదనే వున్న నోట్లకట్ట పట్టుకుని రైలుస్టేషన్కు జారిపోయాడు.

*　　*　　*

"దెయ్యం, దెయ్యమని వెయ్యి రూపాయిలు గంగలో పోశాం." అంది రామయ్య పంతులు భార్య

"అవును. మన పిల్లలికి దెయ్యం పట్టింది మరి. ఈ దెయ్యాలను కూడా నేనే సృష్టించాను" అన్నారు రామయ్య పంతులు గారు



# ఆశ్రుధారలు

**'రామ్‌చంద్'**

ఎదురుగా కృష్ణ అవతల ఒడ్డునున్న జడపల్లి, షూటింగ్ అయిపోయిన తర్వాత పట్టించుకునే నాథుడు లేక బోసి పోతున్న చరిత్రాత్మక చిత్రం తాలూకు సెట్టింగ్ లాగా వుంది

వేసవికాలపు కృష్ణానది, రెండు మహా పర్వతాలమధ్య నడుస్తున్న పిల్ల కాలువవలె మెల్లగా ప్రవహిస్తూ తనలో తానేదో పాడుకుంటున్నది.

ఒడ్డు దిగాడు మూర్తి. ఎటుచూచినా వివిధాకారాల్లోవున్న నున్నటి రాళ్లు... చిన్నవి, పెద్దవి ఏదో శిథిల మహానగరాన్ని జ్ఞప్తికి తెస్తున్నవి. "నిజంగా మన వాళ్లకు వెఱ్ఱిగాని, కాకపోతే స్వభూమిలో ఏముందో గూడా తెలుసుకోక పాశ్చాత్య దేశాలపైకి ఎగబడుతారెందుకో!" చీకట్లలుముకున్న అతని హృదయంలో ఓ మెరుపు మెరిసింది.

కూజాలో నీళ్ళవలె చల్లగా, మోకాలు లోతు గూడా లేని నదిని దాటి ఊరు చేరుకున్నాడు.

జడపల్లి!.. పూర్వం ఇచ్చట జడలు నిర్మించేవారని అందుచేత దీనికా పేరు వచ్చిందని అంటారు; కాని, నేడు జడలు నిర్మించకపోవటం అటుంచి, హైద్రాబాద్‌లో లీనమై వజీరాబాద్ అనే మారు పేరుతో ఛలామణి అవుతున్నది ఒకానొకప్పుడు, రెడ్డి రాజుల కాలంలో ఇది మహానగరం. వైభవంతో తులతూగిన ఇంద్రపురం.

ఒక సంవత్సరం క్రితం మూర్తి జీవితం అప్పుడే వికసించిన పరిమళ పుష్పం నిరంతరం స్వర్గానుభూతితో తేలిపోయిన అమర సుఖం. హాయిగా జీవితమొక మధుర గానంలా, కాల వేగాన్ని గమనించక నిర్విచారంగా గడిపిన స్వప్నం.. ; కాని, నేడు - ఆ పుష్పం వాడిపోయింది స్వప్నం చెదరిపోయింది చివరకు మిగిలింది అతను, తోడుగా పుట్టెడు దుఃఖం.

మూర్తి పెదవులపైనుండి దీర్ఘమైన నిట్టూర్పు దిగజారింది

*          *          *

గుమ్మంలో వదిన ఎదురైంది నీళ్ల చెంబుతో. మాట్లాడకుండా కాళ్లు కడుక్కొని లోపలికి వెళ్లాడు హాల్లో చదువుకుంటున్న అన్నయ్య కుశలప్రశ్నలు వేశాడు ముక్తసరిగా జవాబిచ్చి దొడ్లోకి వెళ్ళాడు విస్తళ్లు కుట్టుకున్న ముసలమ్మ అతన్ని చూచి గుడ్లనీరు కుక్కుకుంది. అతని హృదయం చివుక్కుమంది

"ఏం నాయనా, ఇట్లా అవుతుందని ఎవరనుకున్నార్రా!" ముసలమ్మ కంఠం ఆవేదనను ఆలాపించింది.

మూర్తికి చిరాకు వేసింది. ఆవేదనతో కుమిలిపోతున్న హృదయానికి ఇదే గాబోలు ఓదార్పు! గిరుక్కున వెనుదిరిగాడు. ఎదురుగా గుమ్మంలో అన్నయ్య నిలబడి వున్నాడు తలవంచుకొని లోపలికి వెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు.

"మళ్ళీ ఆ సంగతెందుకే అమ్మా, వాడు అసలే కుమిలిచస్తుంటే," దొడ్లో అన్నయ్య అమ్మమీద ఎగురుతున్నాడు

"కన్న ప్రాణంరా, కడుపుతీపి అట్లా అనిపిస్తుంది వాడి కష్టం ఒకటేనూ నాదొకటా!" అమ్మ కంఠం రుద్ధమైంది

అన్నయ్యకూతురు వచ్చి "బాబాయ్," అంటూ కాళ్లకు చుట్టుకుంది ఎత్తుకున్నాడు పిల్లను.

"బాబాయ్ . .. బాబాయ్, మరే . మరే .... పిన్నేది బాబాయ్?" వచ్చీరాని మాటల్తో అడిగింది అయిదేళ్ల ఆ పాప; ఆ లేత హృదయానికేం తెలుసు! ప్రశ్నకు సమాధానం అతని నోటివెంబడైతే రాలేదు గాని, కళ్లు మాత్రం జవాబిచ్చాయ్ ..... నీళ్ళతో

"నిండు సంవత్సరన్నరగూడా కాలేదు చిలకా గోరింకల్లాగా వున్నారని ఎంతో మురిసిపోయాను ఏం లాభం! ఈ కళ్ళు పాపిష్టివి," దొడ్లో అమ్మ తన బాధను వెళ్లబోసుకుంటున్నది ఎవరితోనో.

వదిన కాఫీ తెచ్చి టేబుల్‌మీద పెట్టి, తన కళ్లలోకి ఆదోవిధంగా చూచి, పాపను తీసుకొని వెళ్లిపోయింది. ప్రశాంతమైన ఆమె కళ్ళల్లో ఏమిటూ బాధ.. జాలి .. తను రాకుండావున్నా బాగుండేది, వీళ్లందరికీ బాధ కల్గేదికాదు కాఫీ రుచించలా సగం తాగి గ్లాసు టేబుల్‌మీద పెట్టాడు కిటికీలోనుండా దూరంగా కన్పిస్తున్న రెడ్డి రాజుల కాలంనాటి ప్రాకారం దృష్టిని ఆకర్షించింది ప్రాకారం మధ్య వున్న ఆలయశిఖరాలు తనను పిలుస్తున్నట్లు తోచింది. లేచి, కండువా పైన వేసుకొని బయలుదేరాడు

వాకిట్లో, ఎవరితోనో మాట్లాడుతున్న అన్నయ్య, "ఎక్కడికిరా ఇప్పుడు?" అనుమానంగా అడిగాడు

"కొంచెం అటు తిరిగొస్తా" అంటూనే నిష్క్రమించాడతను.

*          *          *

మిట్టలూ పల్లాలూ, రాళ్లు రప్పలూ దాటుకుంటూ, అయిదు వందల సంవత్సరాలనాటిదైనా చెక్కు చెదరక, ఆంధ్ర సామ్రాజ్య స్మృతిచిహ్నం నిల్చివున్న ప్రాకారంలోకి ప్రవేశించాడు మూర్తి

ఈ ప్రాకారంలో పూర్వం రెడ్డిరాజుల కోట లుండేవట. అసలు దీనిలో మూడు పురాలు వుండేవని, లోపలవున్న మూడు దేవాలయాలనుబట్టి వీరభద్ర, నరసింహ, అగస్త్యేశ్వర పురాలని పిలువబడేవని చెప్తారు. ఆ పురాలు, కోటలు, ఈనాడు మనకు కన్పించకపోయినా, వాటికి మూలమైన మూడు దేవాలయాలు మాత్రం నిలచి వున్నాయి

కళాకాంతులు లేక పాడుబడ్డట్లున్న వీరభద్రాలయం ముందు మూర్తి ఆగాడు ఆలయం, ఆలయంలో విగ్రహం ఈ రెండూ వున్నా గూడా దీపారాధన జరగటం లేదు

ఆలయమంతా దుమ్ము ధూళితో నిండి చూడటానికి భీకరంగా వుంది. అక్కడ నిలబడటానికి అతని మనస్సు ఒప్పుకోలేదు. మెల్లగా, ఏదారీ లేని కాలిబాటన పల్లేరుకాయలు పిచ్చి పిచ్చి మొక్కలు తొక్కుకుంటూ నరసింహస్వామి ఆలయం వద్దకు వెళ్ళాడు మహాపర్వతంలాగున్న ఆలయాన్ని చూచి అతని హృదయం గతుక్కుమంది. నిరుడీ రోజుల్లో, ఈ ఆలయంలో .

ఎందుకో అతని ఆలోచనలకు అంతరాయం కల్గింది. ముందుకు సాగిపోతూ పూజారి రాలేదు కాబోలు అగస్త్యేశ్వరాలయం మూసివుంది మరికొంచెం ముందుకు నడిచాడు మూర్తి కింద, ఓ వంద అడుగుల దిగువన, ఓవైపునుంచి మూసి, మరోవైపునుండి కృష్ణ; మూసి కృష్ణల సంగమం.

నడివేసవి ఎండలకు తట్టుకోలేక సుకుమా

రమైన దేహం వాడిపోయిందా అన్నట్లుంది నీళ్ళు లేని మూసీనది నిర్జీవిగావున్న ప్రియురాల్ని చూచి కన్నీరు కారుస్తున్నదా అన్నట్లుంది మెల్లగా ప్రవహిస్తున్న లోతులేని కృష్ణ.

తను అంతే అయ్యాడు.. తన జీవితం అంతే అయింది; వేసవిలో ఈ రెండు నదుల సంగమంవలె ఎదురుగా మూసి లేని కృష్ణ తను సుశీ లేని మూర్తి.

నిరుడు తను సుశీ కలిసివచ్చి ఇదే ప్రదేశంలో కూర్చున్నారు. ఆనాడు రెండు నదులూ ఝరీ వేగంతో ప్రవహిస్తూ, గంభీర గానాన్ని ఆలాపిస్తూ మహదానందంతో కలుస్తున్నవి. మైమరచి పరవళ్లు తొక్కుతూ వస్తున్న మూసిని కృష్ణ హృదయానికి హత్తుకుంటున్నది.

సుశీల అంది. "చూడండి, ఈ రెండు నదుల్ని చూస్తుంటే ప్రేయసీ ప్రియులు జ్ఞాపకం రావటంలేదూ. .. ..." ఆమె అందంలో సొక్కుల్ని చూడటంలో మునిగిపోయిన తను, "ఊ" అని మాత్రం అన్నాడు.

"ఏమిటండి పరధ్యాన! మనసెక్కడ?" చిరుకోపంతో అడిగిందామె

"ఏమీ లేదు సుశీ. ఈ రెండు నదుల్ని చూస్తుంటే మనం వాటి ఛాయల మేమో అనిపిస్తున్నది" ఆమెను దగ్గరకు లాక్కున్నాడు

"అబ్బ ఉండండి," అంటూనే కౌగిలిలో ఇమిడిపోయిందామె

నిజంగా ఆ మధురక్షణాలు! . .

తను కృష్ణ సుశీల మూసి. తన బాహువల్లరిలో వయ్యారాన్నొలకబోసిన సుశీ, ..

తనలో అర్థభాగాన్ని పంచుకున్న సుశీ, తన సర్వం, తన ప్రాణం. సుశీ, తను కృష్ణుడు సుశీ—మూసీనది.

ఆనాటి కృష్ణా మూసీ నదుల వలె, తన జీవితం హాయిగా ఏటువంటి విచారం లేకుండా గడిచిపోతుం దనుకున్నాడు కాని, నేడు తను మూసిలేని కృష్ణ సుశీ లేని మూర్తి, తన జీవితం శశిలేని రాత్రి

మూర్తి కళ్లు చెమ్మగిల్లాయి లేచి నిలబడ్డాడు

"ఛి ఈ జీవితం ఇంకెందుకు! అంతటి సుశీపోగా ఈ ప్రపంచంలో వుండి చేసేదేముంది?" ఉద్వేగంలో తన్ను తాను మర్చిపోయ్యాడు ఆత్మహత్య చేసుకోవాలనే ఆవేశమొచ్చింది ఒక్క అడుగు ముందుకు వేస్తే చాలు నూరగుడుల కిందకు, కృష్ణ మూసీనదుల సంగమస్థానంలోకి .

వెనుక ఎవరో భుజం తట్టున్నట్లుగా అగస్త్యేశ్వరాలయంలో గంట కంగారుగా మోగింది తనేం చేయబోతున్నది అతనికి తెలిసివచ్చింది వెనుదిరిగి ఆలయంలోకి వెళ్ళాడు తెలటి పాలరాతి శివలింగాకృతి అతని హృదయంలోకి దూసుకుపోయింది అర్ధ నిమీలిత నేత్రాలతో నిలబడి, స్వామిపై మనస్సు లగ్నంచేసి తన బాధ కొద్దిసేపు మరచాడు.

* * *

అగస్త్యమహర్షి ఈ శివలింగాన్ని ప్రతిష్ఠించాడని, అందుచేత దీనికిఅగస్త్యేశ్వరాలయమని పేరు వచ్చిందని అంటారు ఒకప్పుడు (ఎప్పుడో,) వేటగాడొకడు ఓ పావురాన్ని తరుముకుంటూ వచ్చాడని, ఆ పావురం గుడిలోదూరి శివుని శరణు వేడిందని, పావురానికి బదులుగా తన తలపైవున్న గంగను తీసుకోవలసిందిగా వేటగాని శివుడు కోరాడని, అంత వేటగాడు తన రెండు చేతుల్తోనూ పరమేశ్వరునితలపైవున్నగంగను పెకలించుకొని తీసుకొని వెళ్లాడని ఓ గాథ చెప్తారు ఈ కథ ఎంత నిజమోగాని శివలింగంలోనికి చొచ్చుకొనిపోయిన పది వేళ్ళ చారలు నేటికీ మనకు కనిపించుతాయి ఆ చారలనుండి నిరంతరం నీరు పైకుబుకుతుంటుంది.

కొందరు ఈ కథ కేవలం కల్పితమని, నూరడుగుల క్రింద ప్రవహిస్తున్న కృష్ణానది నుండి పైనున్న శివలింగానికి యంత్రంవంటి అది అమరివుండి వుంటుందని అంటారు. ఈ రెండోదే నిజమైతే, నవీన విజ్ఞానంతో మిడిసిపడుతున్న శాస్త్రజ్ఞులు తలలొంచవలసిందేగా!

* * *

హారతి అద్దుకొని, అర్చకుడిచ్చిన ఫలపుష్పాలు తీసుకొని బయలుదేరాడు మూర్తి.

ఒకనాడు తను సుశీతోగూడా వచ్చి ఈ దేవునికి అభిషేకం చేయించాడు. ఆనాడెంత ఆనందమో ఈనాడంత విషాదం. ఆనాడు తను సుశీసమేతుడై లోకమంతా సౌఖ్యంతో కూడివుందనుకున్నాడు. ఈనాడు, భార్యా వియోగియైన తనకు లోకమంతా శోకమయంగా కన్పిస్తున్నది.

ఆనాడు అభిషేకం జరుగుతున్నది. అర్చకుడు మంత్రపుష్పం చదువుతున్నాడు. తమిద్దరు ఎంతో సంతోషంతో, శివుని కెదురుగా ముకుళిత హస్తాలతో నిలబడి, మనస్సులు పరమేశ్వరునిపై లగ్నంచేసి ఎన్నో కోరికలు కోరుకున్నారు ప్రక్కనే కూర్చుని తమిద్దరిని చూస్తున్న అమ్మ కళ్ళనుండి ఆనంద బాష్పాలు వర్షించాయి, కాని నేడవి దుఃఖాశ్రువులే అయినవి

కలత మనస్సుతో నరసింహస్వామి ఆలయం ముందుకు వచ్చాడు. లోపలకు వెళ్ళటానికి బుద్ధిపుట్టటంలేదు ఇంటికి వెళ్లటానికి కాళ్లాడటంలేదు. ఏమిటో తెలియని భయం ఎందుకో అతన్ని ఆవహించింది.

సంవత్సరం క్రితం ఈ గుడిలోనే తను సుశీలను చూచాడు. జడపల్లి చూచివెళ్దామని వాళ్లంతా అన్నయ్యగారింట్లో దిగారు. ఆమెను చూచింది మొదలు తన మనస్సంతా ఆమెపైనే లగ్నమైంది తనవాళ్ళు ఈ పెళ్ళికి ఒప్పుకుంటే ఈ గుళ్లోనే వివాహం జరిపించుతానని స్వామికి మొక్కుకున్నాడు. వివాహం ఈ ఆలయంలో స్వామి సమక్షంలో జరిగింది పెళ్లిపెద్దల్లో స్వామి ఒకడు

తానైతే తనమాట చెల్లించుకున్నాడు; కాని స్వామి! తమ అన్యోన్య దాంపత్యాన్ని

# ★ అశ్రుధారలు ★

చూచి నిప్పులు పోసుకున్నాడు. సుఖంగా నిర్విచారంగా గడిచిపోతున్న తన జీవితాన్ని చూచి ఓర్వలేకపోయాడు.

"ఓ నరసింహస్వామీ, నీవు దయామయుడవని, భక్తులపాలిటి కల్పతరువువని, దీనబంధువని అంటారు. అంతా కల్ల. బూటకం. కేవలం నీ మొక్కులు తీర్చుకోవటానికి ఇదో తంతు...నాటకం, నీవు దేవుడవా?...కాదు. సగం మనిషివి. సగం సింహానివి. మనిషి స్వార్థపరుడు సింహం దయా దాక్షిణ్యాలు లేని అడవిమృగం ఈ రెండిటి అవతారాన్ని దాల్చిన నీవు నాటికంటే కర్కోటకుడవు నిర్దయుడవు. హృదయంలేని కఠిన శిలవు," నోటికి వచ్చినట్లు స్వామిని ఆడిపోశాడు మూర్తి. అతని దేహం జలదరించింది అప్రయత్నంగా.

ఏమిటి తను చేస్తున్న పని? దైవాన్ని తిట్టడమా? దైవ మేంచేశాడు? తన కర్మ ఇట్లా కాలింది. దానికి ఆయనేం చేస్తాడు.

మెల్లగా, అడుగులో అడుగువేస్తూ లోపలికి వెళ్లాడు దీపాల కాంతిలో స్వామి విగ్రహం తన్ను చూచి, తన శేంతనాన్ని చూచి నవ్వుతున్నట్లుంది.

* * *

నరసింహస్వామి ముక్కుకు సూటిగా కొంచెం దూరంలో రెపరెపలాడుతున్న జ్యోతి వుంది. దానికి కొంచెం క్రింద నిశ్చలంగా దేదీప్యమానంగా మరో జ్యోతి వెలుగుతున్నది. ఈ స్వామి ప్రత్యక్షదైవమని ఆయన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తాడని, నిదర్శనం ఆయన ముక్కుకు సూటిగా రెపరెపలాడుతున్న జ్యోతేనని అంటారు.

* * *

మూర్తి దృష్టి రెండు జ్యోతులపైకి మళ్ళింది. అతనిని ఎక్కడాలేని విశ్వాసం ఆవహించింది. కాని అంతలో అనుమానం వేసింది, ఇంత ప్రత్యక్షదైవం తన సుశీని బ్రతికించలేకపోయాడేమా అని.

సుశీ! అతనికి ప్రపంచమంతా సుశీమయమైనట్లు తోచింది అతని హృదయంలోని ప్రతి అణువు సుశీ నామాన్ని పలవరించింది. సుశీ! తన సర్వం.. తన ప్రాణం...సుశీ లేదు.

సుశీ తన జీవితంలో ప్రవేశించక పూర్వం, నిలకడనేది లేక ఏదో వెలితితో, అసంతృప్తితో దేశమంతా తిరిగాడు.

ఎచ్చటకు పోయినా, ఏచోటకు వెళ్లినా, ఏమిటో అసంతృప్తి.. ఏదో తరుగు.

దేశం అంతా తిరిగి తిరిగి తుదకు అన్నయ్య ఉద్యోగం చేస్తున్న జడపల్లి చేరాడు. చేరిన కొద్దిరోజుల్లో సుశీ కన్పించింది. సుశీని చూచిన మరుక్షణమే తను గమ్యాన్ని చేరానని తెలుసుకున్నాడు. సంతోషంతో ఉర్రూతలూగాడు. సుశీని తనదాన్ని చేసుకున్న రోజున అంతవరకూ వేధిస్తున్న వెలితి తీరి జీవితం పూర్ణిమనాటి చంద్రునివలె నిండుతనాన్ని పొందింది

సుశీ తనింట్లో కాలుపెట్టిన కొద్దిరోజుల్లోనే తనకు యోగం పట్టుకుంది. పట్నంలో పెద్ద ఉద్యోగమైందని వెంటనే బయలుదేరి రావలసిందని మిత్రుడు టెలిగ్రామ్ ఇచ్చాడు సుశీని విడిచి వెళ్ళలేక వెళ్ళలేక పట్నం వెళ్ళాడు ఓ వైపు ఉద్యోగం వచ్చిందనే సంతోషం, మరోవైపు తన సమీపంలో సుశీ లేదనే విచారం; సుఖం

లేకపోయిం దతనికి. కారణంగా ఉద్యోగంలో చేరి నెల తిరక్కుముందే సుశీని పట్నం తెచ్చి కాపురం పెట్టాడు.

పగలు ఆఫీసు, రాత్రిళ్లు సుశీ శెలవుల్లో ఇద్దరూ కలసి బీచిషికార్లు, సినిమాలు దిన మొక క్షణంగా ఆనందంతో గడిచిపోయింది జీవితం.

నాలుగు నెలల తర్వాత తనకు తెలిసింది అదీ, సుశీల సిగ్గుతో చెప్పలేకపోయింది ఆరోజు తను ఆఫీసునుండి ఇంటికి వెళ్లేటప్పటికి ఆమె స్వెట్టరు అల్లుతున్నది తను అడిగాను మీకోసం కాదని అంది చిరునవ్వుతో తన బుర్ర వేగంగా పనిచేసింది తెలుసుకున్నాడు ఎంతో మురిశాడు. 'తన సుశీ బిడ్డతల్లి అవుతుందట'. అతన్ని పట్ట పగ్గాలు లేకపోయినవి

ముమ్మూర్తులా సుశీని పోలిన ఆడపిల్ల కావాలని అతని వాదం. అచ్చం అతనిలా వుండే మొగపిల్లవాడు కావాలని ఆమె అభిలాష ఈ విషయంపై ఇద్దరి మధ్య ప్రణయ కలహం రేగింది తను మూతి బిగించుకున్నాడు చివరకు పోట్లాటకు మంగళహారతి పాడాలని సుశీ అంది

"మనలో మన కెందుకండి అనవసరంగా పోట్లాట మనం అనుకున్నట్లు అవుతుందా. అదేదో ఆ పరమేశ్వరుడే నిర్ణయిస్తాడు" అని

అయిదు, ఆరు, ఏడు, ఎనిమిది నెలలు గడిచాయి తొమ్మిదో నెల ప్రవేశించింది నిండు చూలాలు సుశీ రోజురోజుకు నూత్న శోభతో పరిపూర్ణ మాతృత్వాన్ని పొందబోతున్నది. ఎప్పుడూ ఆమె కెదురుగానే కూర్చుని ఏమేమిటో చెప్తూ, ఆమె అందాన్ని తనివితీరా కళ్ళతో తాగుతుండేవాడు ఆఫీసుకు పోవటానికి బుద్ధి పుట్టేది కాదు తప్పనిసరిగా వెళ్ళాల్సొచ్చేది ఆఫీసునుండి రావటం ఆమె కెదురుగా కూర్చోవటం పరిపాటైంది ఆఫీసులో కూర్చునే ఆ కొద్ది గంటలు ముళ్ళమీద వున్నట్లుండేవి

కదిలితే ఏమౌతుందో అని ఆమెను మంచంగూడా దిగనిచ్చేవాడుకాదు ఆమె ఓవైపునుండి సిగ్గుతో బాధపడుతున్నా సేవకునిగా, ప్రాణస్నేహితురాలుగా ఉపచర్యలు చేసేవాడు వంటకు మనిషిని పెట్టాడు. ఆ శుభం జరిగిపోయేంతవరకు ఇంట్లోనే ఉండిపొమ్మన్నాడు పని మనిషిని

పురిటికి ఇంటికి పంపవలసిందని మామగారు జాబు వ్రాశారు తన కిష్టంలేదు తను సుశీని విడిచివుండలేడు అదీగాకుండా ఆ పల్లెటూళ్లో మైక్రోస్కోపుతో వెతికినా మంచి డాక్టరు దొరకడు. ఇక్కడే, హాస్పిటల్లో పురుడు పోసుకుంటుందని, అత్తగార్ని పంపవలసిందని జవాబు వ్రాశాడు

ముందుగానే ఎందుకైనా మంచిదని మిత్రుడైన డాక్టరుకు చెప్పి హాస్పిటల్లో ఓ గది రిజర్వు చేయించాడు ఓ నెల రోజులు శెలవు పెట్టుదామనుకుంటూ హాస్పిటల్కు వెళ్ళాడారోజు మధ్యాహ్నం పక్కింటి వాళ్లబ్బాయి రొప్పుతూ వచ్చి చెప్పాడు, అత్తయ్య పడిపోయిందని, మాటలాడటం లేదని. తన గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. మనస్సులో మనస్సు లేదు. పై ఆఫీసరుకు చెప్పాలన్న విషయంగూడా మరచి ఇంటికి పరుగెత్తాడు. ఇల్లంతా చుట్టుపక్కల వాళ్ళతో నిండివుంది. సుశీ రక్తం మడుగులోవుంది. తనకు స్మృతి తప్పింది తెలివి వచ్చేటప్పటికి అంతా అయిపోయింది.

మూర్తి విగ్రహంముందు సాష్టాంగపడ్డాడు అతని కళ్ళు బాధతో మూసుకుపోయినవి.

"స్వామీ, ప్రభూ, నా సుశీని తిరిగి నా కివ్వు. లేదా నన్ను నా సుశీవద్దకు తీసుకుపో సుశీలేని నే నెందుకు. లక్ష్మీదేవి లేకపోతే నీ వేమౌతావు? ఆనాడు ఆమె వెళ్లిపోయిందనేగా, ఆమెను వెదుక్కుంటూ భూలోకంలోకి వచ్చి ఏడుకొండలపై వెలసింది. దేవుడవైన నీవే భార్యావియోగాన్ని భరించలేకపోతే, ఇక మానవమాత్రులం మా సంగతి వేరే చెప్పాలా!" పిల్లవానిలా మూర్తి రోదించసాగాడు

"ఎవరు నాయనా? ఏమిటి బాబూ?"

దేవుడు మాట్లాడుతున్నాడా! మూర్తి తలెత్తిచూచాడు ఋషివలె వున్న వృద్ధ పూజారి తనపాలిట దైవంలా ఎదురుగా నిల్చొనివున్నాడు

"నీవా మూర్తిబాబూ. పాపం.. లే బాబూ లే గతం గతః అన్నారు పెద్దలు అయిపోయిన దానికోసం విచారించి లాభం ఏముంది? మనం కేవలం నిమిత్తమాత్రులం మన జీవితాలు క్షణభంగురాలు ఏ నిముషానికి ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు నాయనా. జీవితం అన్న తర్వాత కష్టాలు సుఖాలు తప్పవు వెలుగు చీకట్లు లోకానికి ఎట్లాగైతే సహజమో మనకూ కష్టసుఖాలు అంతే సుఖం వచ్చిందని కేరింతలుగొట్టి లాభంలేదు. కష్టాలొచ్చాయని కుమిలి ప్రయోజనంలేదు ఎంత సుఖం వుంటుందో అంత దుఃఖం వుంటుంది ఎంత దుఃఖం వుంటుందో అంత సుఖం వుంటుంది ఇదే నాయనా ఈ జీవిత రహస్యం"

మూర్తికి హృదయంనుండి ఏదో బరువు తొలగుతున్నట్లనిపించింది. లేచికూర్చుని ఆయన పాదాలకు నమస్కరించాడు.

ఒకరోగి తన జబ్బేమిటో తెలుసుకోవాలని క్రొత్తగా ప్రాక్టీసుపెట్టిన డాక్టరు వద్దకు వెళ్లాడు. డాక్టరు చాలాసేపు పరీక్షించాడుగాని జబ్బేమిటో అంతు చిక్కలేదు.

"ఈజబ్బు మీ కిదివర కెన్నడైనా వచ్చిందా?" అని అడిగాడు.

"ఆ, రెండుమూడు సార్లు వచ్చింది."

"ఆ. అలా చెప్పండి. సరిగ్గా ఆ జబ్బే మళ్లీ ఇప్పుడూ వచ్చింది."

"తప్పు బాబూ నేనూ నీలానే మానవుడ్ని నా భార్య చిన్నప్పుడు ఇద్దరు కూనల్ని వదిలిపోయింది ఏమిటి జీవితం అనుకున్నాను స్వర్గసుఖాన్నిచ్చిన అది లేని జీవితం ఎందుకని ఏడ్చాను. కుమిలి కృశించాను. చివరకు తెలుసుకున్నాను అందుకే ఇంతవరకూ బ్రతికి ఉన్నాను"

మూర్తి ఆయన కళ్లల్లోకి చూచాడు. అవి వింత వెలుగులతో నిండివున్నాయి

"రా నాయనా, ఇంటికి వెళ్దాం, నా ఇద్దరు పిల్లల్ని చూద్దువుగాని. ఇద్దరూ ఇంట్లోనే ఉన్నారు. పెద్దది అచ్చం తల్లి పోలిక. ఇద్దరు బిడ్డలతల్లి. దాన్ని వదిలివుండలేక అల్లుడ్ని ఇల్లరికం తెచ్చుకున్నాను. కొడుకు ఇంటర్ పూర్తిచేశాడు. నా తర్వాత ఈ గుడిలో దీపారాధన చేయవలసింది వాడే అందుకని చదువు మాన్పించాను"

మూర్తి లేచి నిలబడ్డాడు. హృదయం తేలికపడింది. అతనిముఖంలో ప్రశాంతత ప్రజ్వరిల్లింది. ఎదురుగుండా వున్న నరసింహస్వామి విగ్రహం తనకంతా తెలుసన్నట్లు చిరునవ్వుతో చూస్తున్నట్లుంది. "ప్రభూ క్షమించు తెలియక నీ స్వయాన్ని అపార్థం చేసుకున్నాను," మనస్సులో క్షమార్పణలు విన్నవించాడు.

బయట అలుముకుంటున్న సంధ్యచీకట్లలో, గుడిమూసిన ధ్వని వినిపించి, ముందు వృద్ధుడు, వెనుకమూర్తి ఒకరివెనుక ఒకరు కలిసిపోయ్యారు. ★



పశుపతెశ్వరాలయం (నేపాల్)



ఫొటో , ఆర్ బుచ్చి వీరయ్య, సికింద్రాబాద్.




# మా చిన్ని పాప!

గోటేటి శ్రీరామారావు

కలదు మాకొక పాప
కలదు కలదండీ!
కిలకిలా చిలుకలా
కేరింతలాడు!

రేపల్లెవాడలో
గోపాలుడల్లె
అందాలపాప ఆ
నందాలముల్లె!

చిన్నారి మాపాప
చేమంతి మొగ్గ.
చిదిమితే నవ్వేటి
చిరు పాలబుగ్గ.

మురిపాల మాపాప
విరజాజి మొగ్గ.
చిదిమితే పాల్గారు
చిన్నారిబుగ్గ.

ఉదయమే కను తెరచి
ఉగ్గులను త్రాగు.
కారు కారంటూ, షి
కారుగా ప్రాకు.

కలదు మా పాప, రా
చిలుకలా పలుకు.
చీటికీ మాటికీ
చిరునవ్వు లొలుకు.



# సీతాకోకచిలుక

సామగానం సరస్వతీదేవి

పూర్వం ఒకప్పుడు జపాను దేశంలో కునిషాదా అనే పేరుగల సామంతుడుండేవాడు. ధనవంతుడు, దయావంతుడు అవడంచేత అతనికీర్తి దేశమంతటా వ్యాపించింది. కాని కాలం ఎల్లప్పుడూ ఒకేరీతిగా ఉంటుందా? అతని వృద్ధాప్యంలో దురదృష్టం అతన్ని వరించి నాశనం చేసింది. జపానుదేశంలో చీటికీ మాటికీ భూకంపాలు వస్తూంటాయని మీకు తెలుసు అలాగే ఒకసారి భూకంపంవచ్చి అతనిసౌధం కూల్చివేసింది. అపారమైనధనం, ధాన్యం, వస్తుసామగ్రి అన్నీ భూగర్భంలో లీనమై పోయాయి. భార్య, కొడుకులు, కోడళ్లు భూదేవికి బలియైపోయారు కునిషాదా, అతని ముద్దులపట్టి టెకోనామాత్రం ప్రాణాలతో బయటపడ్డారు. ఈ ప్రమాదంలో కునిషాదా రెండుకళ్లూ పోయాయి. అసలే వృద్ధుడు, సర్వం నాశనమైంది, దానికితోడు కళ్లుకూడా పోయాయి. అతని దుఃఖం చెప్పనలవికాదు. ఉన్న ఒక్క కూతుర్ని చూసుకొని కొంత సంతృప్తితో, దక్కించుకోగలిగిన కొద్దిపాటి పాత్రలతో, గుడ్డలతో కునిషాదా ఉన్న ఊరువిడిచిపెట్టి దూరప్రాంతానికి వలసపోయాడు.

తన్నూ, తన పూర్వపు హోదానూ ఎవరూ ఎరగని ఊళ్లో చిన్నఇల్లు కట్టుకుని కుమార్తెతో నివసించసాగాడు మొదట కొన్నాళ్లు జీవనం గడపడం కష్టసాధ్యమైంది కాని క్రమేణా జపానులో గుడ్డివాళ్లు చేయదగిన వృత్తులేవో నేర్చుకుని దానిద్వారా కొంత సంపాదించి పొట్టపోసుకునేవాడు.

టెకోనా పెద్దదైంది. ఆమె పువ్వులు అమ్మి మరికొంత డబ్బు ఇంటికి తెచ్చేది గుడ్డివాడైనతండ్రికి ఆమె ఏలోటూ రానీకుండా, తనే ఆయన కళ్లుగా పనిచేసేది ఎప్పుడూ పూలతోటలో పూలకన్నెలా తిరిగే టెకోనా, యౌవనం వచ్చినకొద్దీ గులాబీపూల నాజూకుదనం, తామరపూవులస్వచ్ఛకాంతులూ, సంపెంగపూవుల మనోహరమైనవాసనా సంతరించుకుంది. ఆమె పూలుకోసేటప్పుడు తుమ్మెదలు ఝుమ్మనిమూగి మంచిమంచి పువ్వులు చూపించేవి. సరస్సులోని హంసలు ఆమెను చూడగానే దగ్గిరికి ఈదుకొనివచ్చేవి పక్షులు ఆమెబుజాలమీద వ్రాలేవి.

ఒక మధ్యాహ్నంవేళ ఆమె పువ్వులు గుచ్చుతూ అలాగే నిద్రపోయింది. ఆమె చేతిలోని గులాబీపువ్వు తక్కిన పువ్వులతో "హుష్ గోల చెయ్యకండి. టెకోనా నిద్రపోతోంది," అన్నది. ఇంతలో టెకోనా పెదవులమీద ఒక సీతాకోకచిలుక నిలుచుంది. అది కొంతసేపు రెక్కలు విదిల్చి రాచనగరుకేసి ఎగిరిపోయింది.

మరొకపువ్వు అన్నది: "అదిగో ఒక సీతాకోకచిలుక టెకోనా పెదవులనుంచి ఎగిరి వెళ్ళింది. బహుశా అది టెకోనా ప్రాణమే నేమో. 'టెకోనా' అంటే సీతాకోకచిలుక అనేగదా అర్థం! ఎక్కడికివెళ్ళిందో ఏమో ఎవరికితెలుసు? అది తిరిగి వచ్చేదాకా టెకోనా మేలుకోకుండా మనం రక్షించాలి."

తక్కిన పువ్వులు అలాగేనన్నాయి.

ఆరోజునే జపాను చక్రవర్తి హ్యాంగ్ తనకోటలో సభామందిరంలో మంత్రులతో, ఇతర సభికులతో ఏవో రాచకార్యాలు చక్కబెడుతున్నాడు అతనికిఇరవైఅయిదేళ్లు. రాజ్యానికి వచ్చి అయిదేళ్ళయినా ఇంతవరకూ పెళ్ళిమాట తలపెట్టలేదు. ఎప్పుడూ రాజకీయ విషయాలలోనే మునిగి తేలుతూ ఉంటారు. ఎందరో ధనాఢ్యులైన సామంతులు, ఇతర దేశాలరాజులు తమతమ పుత్రికలను జపాన్‌చక్రవర్తికిచ్చి వివాహం చేయడానికి సంబరపడ్డారు. కాని అతడు ఎవరినీ కన్నెత్తిచూడలేదు.

కొలువు చాలించిన తర్వాత చక్రవర్తి ఒకరిద్దరు మంత్రులతో కలిసి చల్లగాలికోసం మేడపైభాగానికి వెళ్లాడు. దూరంగా ఎండలో ధగధగలాడే మంచుకొండలు, పచ్చని అడవులు కనిపిస్తున్నాయి.



# ★ సీతాకోక చిలుక ★

చక్రవర్తి ఇదంతా చూస్తూ ఏదో ఆలోచనలో పడ్డాడు. అప్పుడొక సీతాకోకచిలుక వచ్చి చక్రవర్తి సమీపంలో ఉన్న పూలకుండు మీద వాలింది

"ఈ అందాలరెక్కల పురుగు ఇక్కడ ఎందుకు వాలిందో? ఇది మంచి శకునమే అనుకుంటాను," అన్నాడు చక్రవర్తి.

'-భూ! సీతాకోకచిలుక ఇలాంటి ఏకాంతస్థలానికి ఎగిరివస్తే, ఇక్కడికి ప్రియతములైనవారు త్వరలో వస్తారనిసూచన. ఇది మన దేశంలో దైవజ్ఞులు చెప్పే శకునం," అన్నాడొక వృద్ధమంత్రి

"కాని నాకు ప్రియతములెవరూ లేరే నేనెవ్వర్నీ ప్రేమించలేదే. నాకు రాజకీయాలే సర్వమూను," అన్నాడు చక్రవర్తి

ఇంతలో సీతాకోకచిలుక పూలకుండునుంచి లేచి ఒయ్యారంగా వలయనృత్యం చేస్తున్నట్టు చక్రవర్తిచుట్టూ తిరిగి అతని చేతి విసనకర్రపై క్షణంసేపువాలి, మళ్ళీ తుర్రున ఎగిరిపోయింది.

అది ఎగిరిపోతుంటే బరువైన హృదయంతో దానికేసే చూశాడు చక్రవర్తి తరవాత ఇలాఅన్నాడు.

"జపాన్ సామ్రాజ్యానికి మహారాణి లేకపోవడం తీరని కొరత కదూ?"

"అవును ప్రభూ!" అన్నారు మంత్రులు.

"అయితే నేను త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నాను."

ఈమాటతో మంత్రులకు బ్రహ్మానందమైంది.

రెండు మూడు రోజుల తర్వాత వృద్ధసామంతుడు కునిమాద్దా తన కుమార్తెను పిలిచి ఒక సంతోష వార్త చెప్పాడు:

"విన్నావా టెకోనా? రాజోద్యానవనంలో చక్రవర్తి ఈవేళ సాయంత్రం బ్రహ్మాండమైన విందు చేస్తున్నారు. ఈ చుట్టుపక్కలఉన్న సామంతులందర్నీ తమతమ కుమార్తెలతో సహా రమ్మని ఆహ్వానించారు. వారిలోనుండి ఒకరిని తనరాణిగా వరిస్తారట. అమ్మాయ్. మనకు మంచిరోజులు వస్తాయేమో ఎవరికి తెలుసు? కనుక నువ్వుకూడా నాతోరా. మనం ఇప్పుడు బీదవాళ్లమైనా మనవంశం బీదవంశం కాదుగదా. మనది సామంతుల కుటుంబం. మనంకూడా వెడదాం. మన పాత యింట్లోనుంచి తెచ్చిన పెట్టె ఒకటుంది చూశావా?

అందులో ఖరీదైన నా పాత దుస్తులున్నాయి పట్రా," అన్నాడు.

ఒకోనా ఆదుస్తులు తెచ్చి తండ్రికిచ్చింది. అవి ఆయన ధరించాడు. తరవాత కుమార్తెని కూడా ఆ పెట్టెలోఉన్న మంచిదుస్తులు ధరించమన్నాడు. అందులో ఇదివరకు ఒకోనా తల్లిదుస్తు లుండేవి. కాని వాటిని చాలకాలం కిందటే ఏదో అవసరమొస్తే డబ్బుకోసం ఒకోనా అమ్మివేసింది. అందుచేత "నాన్నా! ఆబట్టలు లేవు. నాకేం ఫరవాలేదు. ఈ బట్టలతోనే ఇలానే వస్తాను," అంది.

ఆసాయంత్రం రాజోద్యానవనం పెళ్ళిపందిరిలా కలకలలాడింది రంగు రంగుల దుస్తులు ధరించిన స్త్రీలు, పురుషులు విలాసంగా అటూ ఇటూ తిరుగుతున్నారు నీటి బుగ్గల నుండి నీటిధారలు జల్లులు జల్లులై ఎగసి వస్తున్నాయి పూలచెట్లు కూడా సంతోషంతో ఊగసలాడుతున్నాయి మేళతాళాలు మోగుతున్నాయి. ఆ సమయంలో ఒకోనా తన ముదుసలితండ్రిని చెయ్యి పుచ్చుకొని నడిపిస్తూ వచ్చింది రాగానే ప్రతివారూ చక్రవర్తికడ మోకరిల్లి వెనక్కిపోవడం ఆచారంగనుక, ముందు చక్రవర్తిని సమీపించింది.

చక్రవర్తి కునిషాదాను చూశాడు వృద్ధుడైనా కునిషాదాకు పూర్వపు ఠీవి చెక్కుచెదర లేదు అతన్నిచూసి చక్రవర్తి జాలి పడ్డాడు తరువాత అతనివెనుక ఒదిగినుంచున్న ఒకోనాను చూశాడు అరవిరిసిన గులాబీ మొగ్గలా, బెదిరిపోయిన లేడి కన్నెలా కుంచించుకు పోతున్న ఆమెను చూడగానే చక్రవర్తి హృదయం రెపరెపలాడింది ఆ క్షణంలో ఆమెతనకుకూడా మిగతా వారిలాగ మంచిబట్టలుంటే ఎంత బాగుండుననని అనుకుంది.

ఇంతలో రాజసేవకు డొకడు గొంతుపెట్టుకుని అరుస్తూ ఒక ప్రకటన చేశాడు.

"మూడు రోజులకిందట చక్రవర్తిగారికి కాబోయే సతీమణి అయిన శ్రీప్రాణం ఒక సీతాకోకచిలుకరూపంలో కోటలోకివచ్చింది. ఇక్కడ సమావేశమైన సుందరీమణులలో ఆమె గనుక ఉండేటట్లయితే ఆమెను సీతాకోకచిలుకలు బహిరంగపరుస్తాయి కనుక అంతా సిద్ధంగా ఉండండి"

ఇలా అని అతడు ఒకసంజ్ఞ చేశాడు వెంటనే కొందరు సేవకులు ఒక ఇనుపతీగలపెట్టె తీసుకువచ్చారు. దానితలుపు తెరిచేసరికి బోలెడు సీతాకోకచిలుకలు బయటికి వచ్చాయి. సాయంకాలపు నీరెండలో వాటి రంగుల రెక్కలు మరింత శోభాయమానంగా ప్రకాశించాయి.

వాటిని చూడగానే ఒకోనా సంతోషంతో నాట్యం చేయసాగింది. సీతాకోకచిలుకలు ఆమెను చుట్టుముట్టాయి. ఆమె బుజాలమీద, చేతులమీద, నెత్తిమీద వాలినై. ఆమె ఇంకా ఆనందపరవశురాలై సభాసదులమధ్య అత్యంతరమ్యంగా నాట్యం చేస్తోంది.

ఆరోజున సీతాకోక చిలుక రూపంలో తనవద్దకు వచ్చింది ఈ పేదబాలిక యేనని చక్రవర్తి గ్రహించాడు. సింహాసనం మెట్లు దిగివచ్చి ఒకోనా చేతులు పట్టుకుని మెల్లిగా చేతులమీద ముద్దు పెట్టుకున్నాడు. "ఈమెయే నారాణి. రేపే ఈమెను వివాహం చేసుకోబోతున్నాను," అని చక్రవర్తి అందరికీ ప్రకటించాడు.

వృద్ధసామంతుడు కునిషాదా గుడ్డి కళ్లనుండి సంతోషపు కన్నీళ్లు జలజల రాలినవి చక్రవర్తికి కృతజ్ఞతతో మళ్లీ మోకరించాడు ఒకోనా కూడా మోకరిల్లింది. ఆమెను రెండు చేతులతో లేవనెత్తాడు చక్రవర్తి

అనేకులు సౌందర్యరాశులు, కులీనకన్యలు ఉండగా ఈపేదపిల్లను చక్రవర్తి ఎలా వరించారా అని అందరూ క్షణంసేపు ఆశ్చర్యపోయారుగాని కునిషాదా ఒకప్పుడు గొప్ప సామంతుడని గ్రహించగానే సమాధానపడ్డారు.

"జపాన్ సమ్రాట్టుకూ జై. జపాన్‌సమ్రాజ్ఞికీ జై," అనే జయశబ్దాలు మిన్నుముట్టాయి. ★

[ఒక జపనీస్ కథ ఆధారం]





# ఎందుకు...ఏమిటి!

## 3. "బాలానాం రోదనం బలం"

చంటిపిల్లలు ఏడుస్తున్నప్పుడు వాళ్లని సముదాయించే బాధ్యతలేని పెద్దవాళ్లు "ఏడవనియ్ బాలానాం రోదనంబలం అన్నారు. ఆమాత్రం ఏడిస్తే ఫరవాలేదులే," అంటారు.



"బాలానాం రోదనం బలం — ఫోటో వి రంగనాథన్, మద్రాసు.'

కాని పిల్లలను ఊరుకోబెట్టవలసిన బాధ్యతకల తల్లిదండ్రులకు ఏడుపు ఎంతచిరాకు కలిగిస్తుంది! ఇంట్లో పిల్లలు ఎప్పుడూ 'గీ'మని ఏడుస్తుంటే ఏ పనీ చేసుకోబుద్ధి కాదు, ఏమీ తోచదు పిల్లలు నవ్వుతుంటే ఇల్లంతా పువ్వులు పరిచినట్లు కలకలలాడుతుంది

పిల్లలు పట్టిపుణ్యానికి ఏడవరు తాగినపాలో, అన్నమో పూర్తిగా జీర్ణమై ఆకలివేయగానే ఏడుస్తారు కడుపునిండా తిండిపడగానే మళ్లీ ఆడుకుంటారు బాగా పడిసెం పట్టినప్పుడూ, కళ్లు మంట పెట్టినప్పుడూ, అజీర్ణం చేసినప్పుడు, ఇలాటివే శారీరకమైన ఇబ్బందులు వచ్చినప్పుడు రణగొణ ధ్వనిగా ఏడుస్తారు. బాగా బలహీనంగా నిస్సత్తువగా ఉండే పిల్లలుకూడా ఏడుసారు బలంగా, ఆరోగ్యంగా ఎదిగే పిల్లలు సాధారణంగా ఏడవరు

ఏదైనా అపాయంలో చిక్కుకున్నప్పుడు, ఏకుక్కనో, పిల్లినో చూసి భయపడ్డప్పుడుకూడా పిల్లలు ఏడుస్తారు కొందరు మరీ పిరికివాళ్లు ఉంటారు చీమ చిటుకుమంటే చాలు, బావురుమని ఏడుస్తారు అయితే పిరికితనం అనారోగ్యంవల్ల

కలుగుతుందిగాని ఆరోగ్యవంతులకు పిరికితనం ఉండదు.

పిల్లలు తాము కావాలన్నది వెంటనే ఇవ్వకపోతే, బలవంతాన లాక్కునేశక్తిలేక, నిస్సహాయంగా ఏడుస్తారు. అలాఏడ్చినప్పుడు, వారు కోరింది మనం ఇస్తే, అదే అలవాటై, తమకేదికావలసినా వెంటనే ఏడుపు ఆరంభిస్తారు.

పిల్లలపోషణగురించి శాస్త్రజ్ఞులు, శాస్త్రజ్ఞుల మనుకొనేవాళ్లు వ్రాసిన పుస్తకాలు చదవండి. పిల్లలను కొట్టగూడ దనీ, ఏడుస్తున్నప్పుడు వారి ఏడుపు కారణం తెలుసుకుని, దాన్ని పోగొట్టి, ఏదోవిధంగా మరిపించాలనీ అందులోఉంటుంది. అది చదువుతున్నంతసేపూ "నిజమే సుమా, పిల్లలు పాపం అమాయకులు, వాళ్లని కొట్టడం తప్పు ఇహానుంచీ ఛస్తే కొట్టగూడదు," అనిపిస్తుంది ఆ వాక్యాలు చదువుతున్న సమయంలోనే, పిల్లడు ఏడుపు లంకించుకుంటాడనుకోండి. సీనారేకుడబ్బాలో రాళ్లు గలగలలాడించడం, కుక్కలు మొరగడం, పదిరైళ్లు ఒక్కసారిగా పరిగెత్తడం, మొదలైన శబ్దాలు జ్ఞాపకంవస్తాయి. చదువుతూ చదువుతూ ఉన్న పిల్లల పోషణ పుస్తకం మూనేసి, వెళ్ళి ఆ ఏడుస్తున్నవాణ్ణి టపాటపా నాలుగు ఇచ్చుకుంటారు. వాడింకా గొంతెత్తి యిల్లెగిరిపోయేట్టు ఏడుస్తాడు. కొట్టినకొద్దీ ఏడుస్తాడనే జ్ఞానం అప్పుడు కలిగి పిల్లవాణ్ణి ఎత్తుకుని ఆడిస్తారు.

అందుచేత ఏడుపు, పిల్లలకు బలకరం అని పెద్దలు సెలవిచ్చినా, ఏడ్చేపిల్లల్ని కొట్టగూడదని శాస్త్రజ్ఞులు నీతులు చెప్పినా ఏడుపు వినగానే కోపం రావడం మానవ సహజం. సహజంకదా అని అస్తమానం మీ చెల్లాయినీ, తమ్ముణ్ణి కొట్టకండేం? ★

"ఇంతేనా!" అనేమాటతో మొదలు పెట్టబడిన పాటలు ఇప్పటికి దాదాపు డజనుదాకా మన తెలుగుసినిమాల్లో వినిపించాయి. ఈపాట విన్నప్పుడల్లా మన సినిమాలు ఎప్పుడు చూసినా "ఇంతేనా?" అని చాలమందికి అనిపిస్తుంది. ఇటీవలి ఒకసినిమాలో "ఇంతేలే!" అని ఒకపాటద్వారా సమాధానంకూడా వచ్చింది.

# కర్పూరద్వీపయాత్ర

నోరి నరసింహశాస్త్రి

## 5

హంసరూపాన ఉన్న పిల్లవాడు కేకలేస్తూనే కళ్ళు రెండూ గట్టిగా మూసుకొని "అమ్మా" అని అరిచాడు వాళ్ళ నాన్న దగ్గర విడవకుండా ఉండి ఎప్పుడూ ఉపచారం చేసే అమ్మరూపం అతని కళ్ళఎదట కట్టినట్లయింది అంతలో ఒక మరుపు వంటిది పూనింది దానినే మనము నిద్ర అంటాము ఆ భూతపు కోరలు రెండు అతని ఒంటిని రెండు వైపులా నొక్కివేసినవి పసిపిల్లవాడి నోట్లో పడ్డ వెన్న ముద్ద వలె ఆ హంసదేహము ముక్కలు ముక్కలై నలుసులు నలుసులై ఆ భూతము నోట్లో కరిగిపోయింది

మిగిలిన ముగ్గురికీ కూడా అట్లాగే మైకంవచ్చింది, కాని నెమలి పిల్లవాడు వెంటనే తెప్పరిల్లుకొని ఆవేశంతో పెరిగిపోయి తనమీదికీ తన చిట్టి స్నేహితులమీదికీ వచ్చిపడుతున్న కోరలు పట్టుకొని ఊచి వేస్తున్నాడు ఆ కోర లేమాత్రం కదలనే లేదు మత్తులో ఉన్న మిగిలిన ఇద్దరూ అదృష్టవశాత్తు కోరలమధ్య పడలేదు కోరలు కలుసుకున్నప్పుడూ మళ్ళీ విచ్చుకుంటున్నప్పుడూ కటకటా మనే పెద్ద చప్పుడయింది ఆ చప్పుడు వినబడి వాళ్ళిద్దరికీ మెలకువ వచ్చింది

కోరలు బాగా దూరమై మళ్ళా కలుసుకోడానికి కదలిక ప్రారంభమయింది. ఈమాటు వాటితో పెనుగులాడి లాభం లేదని నిశ్చయించాడు నెమలి పిల్లవాడు ఇక వాటిలో నొక్కుడు పడకుండా గంతువేసి పక్కకు తాను తప్పుకొని చిలకనూ కోకిలనూకూడా తప్పించాడు

అట్లా ఆ కోరలు పైకిలేస్తూ కలుసుకుంటూ కటాకటామంటున్నవి వాళ్లు పక్కకుదూకి తప్పించుకుంటున్నారు కొంతసేపు వారికదిఒక ఆటగాకూడా ఉన్నది ఆ కోరలుకూడా మిషను పళ్ళవలె ప్రతిమాటూ ఒకేవిధంగా కలుసుకుంటూ విడిపోతూ ఉన్నందువల్ల వాళ్ళకు పక్కకుదూకి తప్పించుకోవడం కష్టంగా లేదు

ఇట్లా ఎగరగా ఎగరగా వాళ్ళ కాళ్ళూ రెక్కలూ బలహీనమవుతున్నవి అటువంటి అలుపు కర్పూరద్వీపంలో ఉండగా వాళ్ళెరగరు చెమటకూడా పట్టింది ఇది వాళ్ళకొక కొత్తగా ఉండి ఆశ్చర్యం కలిగించింది.

దానితో వాళ్ళకు భయంకూడా కలిగింది



అంతలో నెమిలివాడు పక్కన హంసలేడని గమనించాడు. దానితో వాడి కడుపులో గుబులు పుట్టుకు వచ్చింది. కర్పూరద్వీపంలో ఉండగా ఇటువంటి గుబులు ఎన్నడూ ఎరగరు. ఆ గుబులే మనముదుఃఖమంటాము.

ఈ విధంగా వాళ్ళకునిద్రా బళలికా, భయమూ దుఃఖమూ వచ్చేప్పటికి శక్తి మరింత కుంగిపోయింది పూర్తిగా అలసి సొలసినారు. ఒళ్లంతా చెమటలు దిగకారుతున్నవి.

అయితే ఆ పెనుభూతపు రంపపు కోరలకుమాత్రము అలుపు ఉన్నట్లే లేదు. కటాకటా— కటాకటా— అంటూ కలుసుకొంటున్నవి, విడిపోతున్నవి

తప్పకోవడంలో ముందు నెమిలి ఈకలు ఒక్కొక్కటే ఆ పళ్ళ మధ్య పడి నలిగిపోవడం మొదలు పెట్టినై. కొంత సేపటికి దాని తోకలో ఈకలు ఒక్కటి కూడా మిగలకుండా నలిగిపోయినై ఈకలు పీకినకోడిఅంటారే, అట్లా ఐపోయినాడు వాడు. తోక పోయి నందువల్ల ఊతం సరిగ్గా నిలవక ఎగరలేక తూలుతున్నాడు. ఆతూలుతూనే పక్కకు కోరలకాటునుంచి తప్పకున్నాడు. అతని రెండు రెక్కలమీదా జిగురువంటిపదార్థ మేదో రెండుపక్కలనుంచి జారి పడుతున్నది. మైకంతో మూసుకు పోతున్న రెండుకళ్లూపెకల్చుకొని, వాలిపోతున్న మెడ ప్రయత్నంమీద ఎత్తి చూచునుగదా, రెండు రెండు కోరలమధ్య చిలకాకోకిలా చిక్కుకొని పచ్చడి ఐనాడు. ఆ పచ్చడే నెమలి రెక్కలమీదికి జారింది. తన పొడుగుపాటి నీలపుమెడ ఎత్తినది ఎత్తినట్లే ఉంచి కళ్ళు మూసుకొని తన సావాసగాళ్ళగతే తలచుకొని దిగులు పడుతూ నిలిచిపోయినాడు.

కటా! కటా!

అతనికి తెలియకుండానే మెడ భూతపు కోరలమధ్యపడి కసుక్కుమని నలిగిపోయింది. పాపము, నెమిలి వీరావేశమంతా అడగిపోయింది. సావాసగాళ్లవలెనే అతనుకూడా పచ్చడిముద్దఐ ఆభూతం కడుపులోకి పోయినాడు.

ఆ నాలుగు పచ్చడి ముద్దలూ భూతం కడుపులో ఒక్కచోటికే చేరినై. వాటిలో ఒకటి తెల్లముద్ద. రెండవది ఇంద్రధనుస్సు రంగులముద్ద. మూడవది ఆకుపచ్చ ముద్ద. నాలుగోది నిగనిగలాడే నల్లముద్ద.

# ★ కర్పూర ద్వీపయాత్ర ★

పాపమూ నాలుగుముద్దలకూ మనస్సులో ఊహాలున్నవి. కాని మాట్లాడుకొనేందుకు నోళ్లు లేవు. ఒకరినొకరు ఆపేక్షగా కలుసుకుందామంటే కదిలేందుకు కాళ్లు లేవు. కళ్లారా చూసుకుందామనుకొన్నా ఒకరికొకరు బాగా కనపడరు. మసిపూసిన అద్దంలోనుంచి చూసినట్లే ఒకరికొకరు అస్పష్టంగా నీడలవలె కనిపిస్తున్నారు.

ఆకాస్త చూపుతోనే వాళ్లు తృప్తిపడుతూ కాలం గడుపుతున్నారు కొంతకాలం అట్లాగే గడిచిపోయింది. మంత్రగాడు నీళ్లు చల్లి మంత్రదండంతో ముట్టుకోగానే రాళ్లుగా మారిన కథలలో పిల్లలగతే వాళ్ళకూ పట్టింది.

వాళ్ళకు పట్టరాని దుఃఖము ముంచుకొని వస్తుంటుంది,—కన్నీళ్లు రావు, ఏడవలేరు అబ్బా!

## 6

అట్లాగే వాళ్ళెన్నాళ్లో ఉన్నారు. రెండవవాడు తనను ఆవరించిన పెంకువంటి పొరను ఎట్లాగైనా తన్నివేయవలెననీ పొడిచివేయాలనీ కుమ్ముతున్నాడు. మూడవవాడూ నాలుగోవాడూ మందకొడిగా పడి ఉన్నారు. ఐనా వాళ్ళూ నెమ్మదిగా పెరుగుతూనే ఉన్నారు.

అందరిలోకీ పెద్దవాడు ముందు తనచుట్టూ ఉన్న గుడ్డునంతా వ్యాపించి దాన్ని పగలగొట్టుకొని బయటికి వచ్చాడు. అతనికి తెలియకుండానే శుచిగా గోమయంతో అలికి ముగ్గుపెట్టిఉన్న భూమిమీదపడి కావుకావు మని ఏడుస్తున్నాడు. వెనక కర్పూరద్వీపంలో ఉన్న వాళ్ళఅమ్మవల్లేనే ఉన్న ఒక ముత్తైదువ ఆపేక్షతో వాణ్ణి తన పాలిళ్ళకు హత్తుకున్నది. అంతే. వాడికి నిద్ర వచ్చేసినట్లయింది. కర్పూరద్వీపం మరచిపోయినాడు. పాలసముద్రం మరచిపోయినాడు. భూతంకోరలు మరచిపోయినాడు. దాని కడుపు మరచిపోయినాడు. అందులో లీలగా పూర్వజ్ఞానంతో ఉన్న గుడ్డుదశ మరచిపోయినాడు. మరుపొక్కటి తప్ప అంతా మరచిపోయినాడు.

కొన్నాళ్ళకి తనగుడ్డుకూడా పగలగొట్టుకొని రెండవవాడు బయటపడ్డాడు. బయటికి వచ్చిందే వ్యవధానంగా నేలమీదనే పడ్డాడు. ఆనేల మామూలు మట్టినేలకాదు. రత్నాలు పొదిగిన పాలరాతినేల. అది ధగధగ లాడుతున్నది. వాడికీ ఏడుపు తప్పలేదు అతనికికూడా, తల్లే ఇచ్చిందో, దాదే ఇచ్చిందో,— పాలు రుచిచూడగానే పూర్వకథ అంతా దట్టమైన చీకట్లో పడిపోయింది.

---

రమేశ్‌చంద్ర, హైదరాబాద్.



మూడవగుడ్డు పగిలి అందులో వాడుకూడా బయటపడ్డాడు. అతడు పడ్డది బలపపురాయి పరిచిన నున్నటినేల. పడంగానే అతనికీ ఏడుపు తప్పలేదు. తల్లిపాలు రుచిచూచినదే వ్యవధానంగా అతని పూర్వగాథ అంతా మరుపుతగిలింది.

నాలుగోవాడే, గుడ్డులోనుంచి జారి, పాపము, పట్టె కటికినేలమీద పడ్డాడు. ఏడుపుకూడా ఏడ్చే ఓపిక లేనట్లు కాస్తసేపు నిస్త్రాణగా అట్లాగే ఉన్నాడు. నలుగురు అమ్మక్కలూ పోగై గందరగోళపడ్డారు. అతనికి వెనక విన్న సప్తస్వరాలూ మనస్సులో భాసించినై. అవే తలుచుకుంటూ సునాదంగా ఏడుపు సాగించాడు. తల్లి పాలిచ్చింది. అంతా ఒకటే మరుపు!

ఈవిధంగా వాళ్లు నలుగురూ నాలుగిళ్ళల్లో పెరుగుతూ వచ్చారు. వాళ్ళకెవరికీ ఒకళ్లసంగతి ఒకరికి తెలియా తెలియదు, ఏమాత్రము జ్ఞాపకమూ లేదు. కర్పూరద్వీపం అసలే జ్ఞాపకంలేదు. అక్కడి అమ్మా నాన్నా అంతకన్నా జ్ఞాపకంలేరు.

ఎవరికి వాళ్లు ఇప్పటి అమ్మానాన్నా ఇళ్ళూవాకిళ్ళూ తప్ప మరోప్రపంచం ఎన్నడూ ఎరగనట్లుగానే వాళ్లు పెరుగుతున్నారు.

## 7

వాళ్లందరిలోకీ రెండవవాడు ఎక్కువ అదృష్టవంతు డనిపించుకొన్నాడు. వాడు మహారాజు కొడుకు, మహారాణికొడుకు, నేలమీద కాలుపెట్టనీయకుండా దాదులుపెంచారు. కొండమీది కోతి కావలెనంటే వచ్చి హాజరయ్యేది.

చదువులన్నీ చెప్పేందుకు ఒక్కొక్క విద్యకు ఒక్కొక్క గురువుచప్పున ఉన్నారు. సమస్త శాస్త్రాలూ వచ్చినై చతుష్షష్టికళలూ వచ్చినై. గుర్రపుస్వారిలో అతడు మేటి. ఏనుగులను నడిపించడంలో నేర్పరి. కత్తిసాము గదాయుద్ధము మల్లయుద్ధము—వీటిలో అతనికి సరిసమానులు లేరు. అందునన్నాడంటే ఎటువంటి అసాధ్యలక్ష్యమైనా, చరమూ స్థిరమూ—ఏదైనా చిటికెలో కొట్టగలడు. అతను రథమెక్కి బయలుదేరినాడంటే శత్రురాజులంతా గడగడలాడేవారు.

అతనెంతో చక్కనివాడు. ఎందరోరాజులు తమపిల్లల నిస్తామంటూ వచ్చారు.అతనికెవ్వరూనచ్చలేదు.

చివరకొకనాడు అతను అడవికి వేటకుపోయినాడు. సింహాలు పెద్దపులులు ఖడ్గమృగాలు తోడేళ్లు ఎలుగుబంట్లు శరభాలు అతని బాణాలకు తలలెగిరి పడిపోతున్నవి. వేటాడివేటాడి అలసి అడవిలో ఒక చెట్టుక్రింద రాయి తలగడగా పెట్టుకొని పరున్నాడు. పరివారము దూరమైంది. ఒంటరిగా అతనక్కడ నిద్రపోతున్నాడు. ఎవరో తలదగ్గర ఉన్నట్లు అలికిడి అయింది. కళ్లు తెరిచిచూచి తన నెత్తిమీద ఎవరో నాగకన్య పడగవిప్పి ఆడుతున్న దనుకొన్నాడు. బాగా పరకాయించి చూచాడు. అతనికేమీ భయము వేయలేదు. చూడ ముచ్చటయింది. అది నిజంగా ఎవరోపిల్లతల. వనదేవతా ఏమిటెప్పా అనుకున్నాడు అతను తన వేపు చూస్తున్నాడని గమనించగానే, ఆపిల్ల తల కొంచెము దూరంచేసి తొలగిసిగ్గుతో నిలుచున్నది. రాజకుమారుడు లేచి పిల్లనడిగాడు.

'పిల్లా, నీవెవరు?'

పిల్ల మాట్లాడలేదు.

'నాగకన్యవా'

జవాబులేదు మళ్ళీ.

'వనదేవతవా?'

మళ్ళీ జవాబులేదు కాని కాదన్నట్లు తల తిప్పుతూ చిన్నచిరునవ్వు నవ్వింది.

అది చూచి రాజకుమారుడు చిరునవ్వుతో, 'మూగపిల్లవా?' అన్నాడు.

పిల్ల కలకల నవ్వింది: 'మీరెవరో?'అన్న కిన్నెరవంటి సన్నటిగొంతు రాజకుమారుడికివినిపించింది.

# కర్పూర ద్వీపయాత్ర

ఏమనవలెనో తోచక రాజకుమారుడు ఆలోచిస్తున్నాడు

'మీకు చెవుడా ?' అని మళ్లీ ఆ సన్ననిగొంతు వినబడ్డది.

రాజకుమారుడు చెవిటివానివలెనే చెవిదగ్గర చేయిపెట్టి తల ఒరగవేసి 'ఊఁ?' అని అడిగాడు.

'అబ్బా, ఈ చెవిటిగొడవతో మీ అమ్మా నాన్నా ఎట్లా బ్రదుకుతున్నారోగదా!—మీ రెవరండీ?'—చివరిమాటలు పెద్ద గొంతుతో అరిచింది.

'ఇది భలే టక్కరు, మూగ దనుకొన్నాను మాట్లాడుతున్నట్లున్నదే!—నాచెవులు బాగా వినపడవు కాని నీవెవరో చెప్పు!'

'నేనా ? రాజుగారి కూతుర్ని.' అని అది అరిచింది.

'ఓహో!—మీనాన్న కోయవాడా ?'

ఆపిల్లముఖాన కోపము వ్యక్తమై అదికూడా ఒకఅందం తెచ్చింది. రాజకుమారుడు మళ్లీఅన్నాడు.

'పిల్లకి కోపము వచ్చిందే.—అయితే మీనాన్న కోయకాదా ?—బోయా ? ఓ బోయదొర కూతురా, నీపేరేమిటి ?'

దానికి మరింత కోపంవచ్చింది. రుసరుస లాడుతూ అన్నది.

'దొంగలతో మాట్లాడే అలవాటులేదు మాకు !'

'మరిప్పుడెట్లా మాట్లాడావు ? నిన్నెత్తుకుపోతా ?'

'అమ్మ దొంగా! చెవుడంటిరే ?'

ఈవిధంగా వారి చెలిమి ప్రారంభమైనది. రాజకుమారుడు తన అడవికి వచ్చినాడని తెలియగానే వనరాజైన ఆపిల్లతండ్రి విలవగల కానుకలు, అడవిలో తప్ప దొరకనిపళ్ళూ, పుట్టతేనే, మూలికలూ, పాలగుండా, బహుమానమిచ్చి అన్నిటితోపాటు తనకూతుర్ని కూడా రాజకుమారుడికి అర్పించాడు.

రాజకుమారుడా పిల్లను ముత్యాలచేరులు వేలాడే అందలంలో ఎక్కించుకొని ఇంటికి తీసుకొనిపోయి తల్లికీ తండ్రికీ చూపించాడు. వాళ్ళెంతో సంతోషించి మహావైభవంగా వాళ్లకు పెళ్లి చేశారు.

## 8

కొన్నాళ్లకు కొడుకుకు రాజ్య మప్పగించి అడవికి తపస్సుకు పోవలెనని రాజుగారికి బుద్ధి పుట్టింది. కుమారుడికి వైభవంగా పట్టాభిషేకం చేశాడు. రంగు రంగుల పట్టుదుకూలములు కట్టి శిరస్సుపై కిరీట ముంచారు.

అప్పు డక్కడికి గొప్ప విద్వాంసు డొకడు వచ్చాడు. ఆస్థానంలోని మంత్రులూ పండితులూ అతనితో చదువులో ఒక్కరూ సరికాలేకపోయినారు. కొత్తరాజు అతన్ని తన ప్రధానమంత్రిగా చేసుకున్నాడు.

అంతలో ఎక్కడో దూరాన లంకనుంచి రత్నాలు ముత్యాలు పగడాలు దంతపు వస్తువులు తీసుకొనివచ్చి వర్తకు డొకడు కొత్తరాజుకి కానుక లిచ్చాడు. అతన్ని రాజు తనకు కోశాధికారిగా ఉండమంటే అతడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

ఆ సాయంత్రం పెద్ద పాటకచేరీ జరిగింది. దూరదేశంనుంచి కొత్త సంగీత విద్వాంసుడు వచ్చి అద్భుతంగా గానం చేశాడు. అతణ్ణి కొత్తరాజు తన ఆస్థానగాయకుణ్ణిగా ఉండమన్నాడు.

వాళ్లెవరో తెలుసా మరి? వాళ్ళెరగరు కాని మనకు తెలుసుగా! హంస నెమిలి చిలక కోకిలగా మారిన పిల్లవాళ్లను గుర్తుపట్టే ఉంటావు వాళ్లు ఎక్కడెక్కడో పుట్టారు; ఎక్కడెక్కడో పెరిగారు; ఏదో తాడుపట్టి లాగినట్లుగా ఒక్కచోటికి ఈనాటికి మళ్లీ ఇట్లా చేరుకున్నారు. ఒకరినొకరు చూచుకొన్నదే వ్యవధానంగా వాళ్లకు గాఢమైన అనుబంధం ఏర్పడింది

కొత్తరాజు పెళ్లిచేసుకున్న పిల్ల ఎవరో తెలిసిందా? సరిగ్గా కర్పూర ద్వీపానికి నావరాగానే అందులో అందరికంటె ముందుగా ఎక్కి కూర్చున్న పిల్ల అదే! అది పడవటాపుమీదికి వచ్చి రమ్మని మాటిమాటికీ దీనంగా సైగలు చేస్తుంటేనేచూసి పాలసముద్రంలోపడ్డ రెండవ పిల్లవాడు పడవవైపుకు పోవలెనని తొందరపడ్డాడు.

ఆ పిల్లతోపాటు మరి ముగ్గురు పిల్లలుకూడా పడవ ఎక్కి, ఎవరిసావాసగానికి అది, ఆముగ్గురికీ, పడవటాపుమీద కటకటాలదగ్గర నిలుచుని రమ్మని చేతులూపినారు. ఆ నలుగురు అమ్మాయిలనుగూడా పడవ భూతం ముందే కోరలతో నమలి మింగేసింది. వాళ్లూ నాలుగు గుడ్లైనారు. నలుగురూ నాలుగిళ్లల్లో పుట్టారు. తల్లిపాలు తాగిందే వ్యవధానంగా పూర్వకథ అంతా మరచిపోయినారు. ఎవరిఅమ్మా నాన్నా, ఇల్లూ వాకిలీ, తమ ప్రపంచమనుకొంటూ పెరిగారు.

మొదటివాణ్ణి పిలిచిన పిల్ల చదువుకున్నవాళ్ల ఇంట్లో పుట్టి పెరిగి మహావిద్వాంసుడైన కొత్త మంత్రిని పెళ్లాడింది.

ముందుగా పడవ ఎక్కిన పిల్ల వనరాజుగారిఇంట్లో పుట్టి రాజకుమారుణ్ణి పెళ్లిచేసుకొని ఇప్పుడు భర్తతోపాటు పట్టాభిషేకం పొంది రాణిఐనది.

మూడోపిల్ల సంపన్నుల ఇంట్లోపుట్టి వర్తకుణ్ణి పెళ్లి చేసుకున్నది.

నాలుగోది పవిత్రులైన పేదలఇంట్లో పుట్టి సంగీత విద్వాంసుడి భార్య అయింది.

ఆ పెళ్లిళ్లద్వారా మళ్లీ ఈనాడు రాజధానిలో వాళ్లంతా కలసికొన్నారు. కలసినప్పటినుంచీ వాళ్లకు ఒకరిపైన ఒకరికి చెప్పలేనంత అనురాగమేర్పడింది. (ఇంకా ఉంది)

# దేవీ ప్రసన్నం

వేము చదువుకొనేరోజుల్లో పదిమంది కుర్రాళ్ళం కలిసి, ఓడాబామీది పోర్షను అద్దెకు తీసుకుని, అందులో, వుండేవాళ్ళం. భార్యని పుట్టింటికంపి, 'హోటలు మెతుకు'లు తింటోన్న మా తెలుగు మాష్టారు కూడా, మాతోబాటు మా లాడ్జిలోనే వుంటుండేవారు. పిల్లలతో బాగా కలిసిపోతారు, కాబట్టి వారంటే పిల్లలందరికీ యిష్టం. ఎక్కువ చనువుగూడాను.

మాష్టారు బహు తమాషా మనిషి. లాడ్జిలో యేవేనా చిన్న చిన్న దొంగతనాలూ అవీ జరిగితే, బహు చాకచక్యంతో దాన్ని తస్కరించిన ప్రబుద్ధుడివద్దనుండి యిట్టేరాబట్టేసేవారు.

“దాన్ని యెవరు తీశారో గుట్టుగా, రాత్రికి రాత్రి, యెవరికీ తెలీకండా నాగదిలో పడేసెయ్యండి. అలా చెయ్యకపొయ్యారా, అనవసరంగా చిక్కులో పడిపోతారు. నాకు దేవీప్రసన్నం వుంది. పూజలో కూచుంటే దొంగవడ్ని యిట్టే కనిపెట్టేసెయ్ గలను.” అని భయపెట్టేవారు.

ఎలావొచ్చేదోగాని, తెల్లవారేసరికి ఆ వస్తువుకాస్తా మాష్టారు గదిలో పడివుండేది.

'రోజులు గడుస్తున్నయ్

వేసవికాలం అందరం హాల్లో పడుకునివున్నాం. మాష్టారు మాత్రం తనగదిలో పడుకున్నారు. మాష్టారు పడుకున్న గదికీ, హాలుకీ మధ్య ఓ చిన్న గది వుంది. ఆగదిలోనే మా పెట్టె బేడా అన్నీ వున్నయ్. ఇటు హాల్లో పడుకున్న వాళ్లకి—అటు గదిలో పడుకున్న మాష్టారుకీ—ఆ గదిలో యేం జరిగినా బాగా కనిపిస్తుంది. పన్నెండుగంటలు దాటి వుంటుంది నాకు అప్పుడే మెలకువ వొచ్చింది కళ్లు తెరిచాను. నాయెదురుగుండా,



ఏ. యస్. చెన్నూర్

యెవరో మా హాల్లోంచే, పిల్లిలా అడుగుమీద అడుగేసుకుంటూ పెట్టెలగదిలోకి వెళుతున్నట్టు కనిపించేసరికి, గుండెలు జల్లుమన్నయ్. దొంగేమో ననుకున్నాను. అరవడానికి ధైర్యంచాలక చూస్తూ వూరుకుండిపోయాను. అతడు తీరాగదిలోకి వెళ్ళి, మేష్టారు పెట్టెమీద వున్న యేదో నల్లనివస్తువుని చేతికి తీసుకున్నాడు. అది కాస్తా చేతిలోంచి జారి, 'ధప్'మని పెట్టెమీద పడేసరికి, నాగుండెలు ఆగిపొయ్యేంత పనైంది. అతడు క్షణంఆగి, నలువేపులా చూచి, మెల్లగావొంగి, దాన్ని అందుకుని, తిన్నగా నాపెట్టెవేపుకే నడిచాడు. మా లాడ్జిలో ఎవరిపెట్టెకీ తాళాలుండవ్. వున్నా వెయ్యడానికి బద్ధకం. అంచేత, అతడు నాపెట్టెని తెరిచి, దాన్ని అందులో పడేసి, తిన్నగా హాలుచేరుకున్నాడు.

వీడెవడో దొంగమాత్రం కాడనీ, లాడ్జిలోని కుర్రాడేననీ, అప్పటిగ్గాని అర్థమయింది కాదు. ముసుగువేసుకుని వుండడంచేత మనిషిని గుర్తుపట్టడానికి వీల్లేకపొయ్యింది.

మొత్తానికి వీడెవడో, నామీద దొంగతనం మోపడానికి వేసిన పన్నుగడ అని, తేలిగ్గా అర్థమయిపోయింది.

ఇంకా యేం జరుగుతుందో చూద్దాం అని, మేలుకుని చూస్తూ వున్నాను. కాని, యేమీ జరగలేదు. దాదాపు అరగంటకాలం యిట్టే గడిచిపోయింది. ఇంతలో మాష్టారు గదిలోంచి మరో వ్యక్తి (తప్పకుండా మాష్టారే అయి వుండాలి) మెల్లగా చప్పుడు కాకుండా పెట్టెల గదిలోకి నడిచాడు ఇతడుకూడా నాపెట్టెవేపుకే నడవడం చూచేసరికి ముచ్చెమటలు పోసినై. అతగాడు జేబులోంచి యేదో తీసి పెట్టెమీదికి వొంగి, యేమోచేసి, లేచి వొచ్చిందారినే వెళ్ళిపోయాడు.

వీళ్ళందరూ వొక్కటై నామీద కత్తి కట్టారల్లే వుంది...

నామీద అపనింద వెయ్యాలని చూస్తున్నారు...

ఇంతకీ, వీళ్ళకి నేను చేసిన అపకారమేవిటి?...

వీళ్ళకి నామీ దెందు కింత కక్ష?...

బుర్రలో యెడతెరిపిలేకుండా, పిచ్చిపిచ్చి ఆలోచన్లు లక్షోపలక్షలు వుత్పన్నమవుతున్నయ్. యెంత ప్రయత్నించినా నిద్ర పట్టడంలేదు. కచ్చేరీలో రెండుగంటలు కొట్టారు. ధైర్యంచేసి, మెల్లగాలేచి, హాలంతా ఓమాటు కలయజూచాను. అందరూ

మంచినిద్రలో వున్నారు. తిన్నగా మాష్టారుగదివద్దకు వెళ్లాను. మాష్టారు కూడా. గుర్రు పెడుతున్నారు. మెల్లగా నాపెట్టెదగ్గరికి చేరుకున్నాను. గుండెల్లో బీతుబీతుగానే వుంది. ఎలాగో పెట్టెతీసి చూచాను. ఆ నల్లని వస్తువు నా పెట్టెలో కనిపించేసరికి కళ్లు గిర్రున తిరిగిపోయినై. అది యేవిటో గాదు. మాష్టారుగారి పర్సు! - చాలా బరువుగాకూడా వుంది. నా అనుమానం కాస్తా దృఢమైంది.

ఈ అపవాదుని తప్పించుకోవడమెలా?...

ఇంతలో, పెట్టె పై భాగంలో చాక్‌పీస్‌తో పెట్టిన యింటూ గుర్తు కనిపించింది.

రాత్రి పుస్తకాలు తీసుకున్నప్పుడు లేనిగుర్తు ఇప్పుడెలా వొచ్చింది?...

బహుశా, మాష్టారుగారువొచ్చి చేసినపని యిదేగాబోలు!...

పెట్టెమీది యింటూ మార్కు చూచేసరికి, నా చిన్ని బుర్రలో ఓ చక్కటి ఆలోచన తట్టింది. వెంటనే సావది కాస్తా ముగించుకుని గుట్టుగా వొచ్చి పడుకున్నాను.

తెల్లవారింది. కొందరింకా నిద్రన్నా లేవలేదు. మాష్టారు 'నా పర్సు కనిపించడం లేదు, ఎవరు తీశారో చెప్పండని' గోలపెట్టేస్తున్నారు. పిల్లలందరూ బిక్కమొహాలేసి నుంచున్నారు.

మేష్టారు వరసబెట్టి, అందర్నీ అడిగింతరువాత, ఫక్కున నవ్వి - "నాకు తెలుసురా అబ్బాయిలూ! దాన్నెవరు తీశారో నాకప్పుడే తెలిసిపోయింది. మీరు చెప్పకపోతే నేను తెలుసుకోలేననుకొన్నారు కాబోలు!" అన్నారు.

కాని ప్రయోజనం లేకపోయింది. పిల్లలందరూ బిక్కమొహాలేసి నుంచున్నారు. నాగుండెల్లోమాత్రం గుర్రాలు పరుగెడుతున్నయ్.

ఇంతలో మాష్టారు - "అంటే రండర్రా అబ్బాయిలూ! అదెవ్వడోగాని యిట్టే పట్టిస్తాను క్షణంలో" అని, అంటూ పెట్టెల గదిలోకి దారి

([illegible]-వ పేజీ చూడండి)



వానర విహారం

—నరసింహారావు ([illegible]), [illegible]

# కార్టూన్ చిత్రాలలో పంచతంత్రం

చలచిత్ర నిర్మాణంలో కార్టూన్ చిత్రాల నిర్మాణం అతి కష్టం. ఇది చాల ప్రయాసతో కూడినపని. దీనికి అపారమైన కార్యదీక్ష అవసరం. మోటార్ గేరేజిలో స్టూడియో ప్రారంభించిన వాల్ట్ డిజ్నీ వంటి విచిత్రవ్యక్తులవల్లనే నెరవేరుతుంది కాని నేటి పోటీలలో ఫార్ములాల రోజుల్లో నెరవేరేది కాదు. కష్టనష్టాలకోర్చి కృషి చేసినా నూటికి వెయ్యికి ఎవరో ఒకరు సాధించగలుగుతారేమో? అలా సాధించిన వాల్ట్ డిజ్నీ కూడా కీర్తి గడించి మార్గదర్శకుడు కాగలిగాడే కాని లాభసాటి బేరంగా కొనసాగించలేక పోతున్నాడు.

బ్రిటన్ రష్యాలలో కూడా కార్టూన్ చిత్రాల నిర్మాణకృషి జరుగుతోంది కాని వాల్ట్ డిజ్నీ కృషితో పోల్చడం కష్టం. భారతదేశంలో కూడా ప్రయత్నాలు జరిగాయి కాని ఇంతవరకూ ఫలించలేదు.

అయితే కార్టూన్ చిత్రాల నిర్మాణం వంటి కళ అలా ఊరికే ఉండిపోదు. నిత్యం ఎవరో ఒకరు కృషి చేస్తూనే



గతవారం ఆంధ్రదేశంలో విడుదలైన ఆహ్లాద్ చిత్రా వారి సుహాగన్ లో గీతాబాలి

* * * *

నేషనల్ ఆర్ట్ థియేటర్ వారి "తోడుదొంగలు"లో మద్దాలి కృష్ణమూర్తి, యన్ టి రామారావు



# కార్టూన్ చిత్రాలలో పంచ తంత్రం

వుంటూరు కృషి విఫలమౌతున్న కొద్దీ పట్టుదల అధికమౌతుంది మన దేశంలో ఇంతవరకూ జరిగిన ప్రయత్నాలు విఫలమైన మాట నిజమే గాని ప్రయత్నాలు మాత్రం కొనసాగుతూనే వున్నాయి ఇటీవల కృషి చేస్తున్న వారిలో శ్రీ కె యస్ గుప్తే గారొకరు వీరి కార్టూన్ చిత్రాల నిర్మాణ కృషి 1938 లోనే ప్రారంభమైంది కొద్ది కాలంలోనే వారు 75 అడుగుల కార్టూన్ చిత్రం సినీ కలర్ లో తీశారు ఇటీవల "శశి" అనే మరాఠీ చిత్రం కోసం 200 అడుగుల కార్టూన్ చిత్రం ఒకటి నిర్మించారు శ్రీ గుప్తే ఇంగ్లండ్, యూరప్ పర్యటించి సినిమా స్టూడియోలు పరిశీలించి వచ్చారు ఇప్పుడు వారు వారి సోదరుడు కుమారుల సహాయంతో కార్టూన్ చిత్రాల నిర్మాణానికై తీవ్రకృషి చేస్తున్నారు

విదేశాలలో కార్టూన్ చిత్రాలను చౌకలో నిర్మించడానికి జరుగుతున్న యత్నాలను వీరు పరిశీలించారు ఇప్పుడు తీస్తున్న పద్ధతి చాల కష్టం ఈ పద్ధతిని భారతదేశంలో కార్టూన్ చిత్రానిర్మాణం బొత్తిగా గిట్టదు ఒక్కొక్క ఫేమ్ చొప్పున చిత్రకారుడు గీసిన చిత్రాల్ని ఫొటో తీసి నిర్మిస్తే అడుగు ఒక్కంటికి రు 50 ఖర్చు అని గుప్తే గారి అంచనా అమ్మవలసినప్పుడు అడుగు ఒక్కంటికి రు 55 కి అమ్మాలి బ్రిటన్ లో ఇంతకి 20 రెట్లు ఖర్చు పెట్టాలిట అమెరికాలో 40 రెట్లు అయినా వాల్ట్ డిజ్నీ స్నోవైట్, సిండ్రెల్లా, ఆలిస్ మొదలైన కార్టూన్ చిత్రాలు తీశాడు. రష్యాలో కార్టూన్ చిత్రాలనిర్మాణం అతి మందంగా సాగుతోంది

ఇతర దేశాలలో కార్టూన్ చిత్రాల నిర్మాణానికి పెట్టుబడైనా పుట్టింది మన దేశంలో అది లేదు

కార్టూన్ చిత్రాలు ముఖ్యంగా పిల్లల వినోదానికి, విజ్ఞానానికి వినియోగపడతాయి కార్టూన్లలో అయితే దేవతల కథలు, జంతువుల కథలు చక్కగా నప్పుతాయి అలౌకికమైన వాతావరణాన్ని సృష్టించడానికి కార్టూన్లనుపోలిన సాధనం లేదు కథలు చెప్పే అమ్మమ్మలు నాయనమ్మలు పుక్కిటి కథలు మర్చిపోయి సినీమాల కెగబడుతున్న ఈ రోజుల్లో శతాబ్దాల తరబడి వస్తున్న కాకమ్మ కథలు మరుపులో పడిపోతున్న సమయంలో మళ్ళీ కార్టూన్ చిత్రాలే వాటి నుద్ధరించగలగాలి ఈమధ్య స్కూళ్లలో *Visual Education* ను వేశ పెట్టాలని ప్రయత్నించిన ప్రభుత్వాలూ, లక్షలకొద్దీ పెటుబడి పెట్టగల సినిమా సంస్థలూ కార్టూన్ చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించినట్లయితే లబ్ధి ఉండకపోగు మామూలు చిత్రాలకంటె కార్టూన్ చిత్రాల్ని పిల్లలే కాకుండా పెద్దలుకూడా చాల ఆసక్తితో చూడగలరు

ప్రపంచ ఖ్యాతిచెందిన పంచతంత్రం కథలు కార్టూన్లలో నిర్మించబడితే పిల్లలకి పెద్ద పెన్నిధి దొరికినట్లే గుప్తేగారు అప్పుడే పంచతంత్రంలో కొన్ని కథల్ని తీసుకొని ముందు చిత్రాలు తయారు చేస్తున్నారట ఎప్పుడు షూట్ చేస్తారో తెలియదు ★

# యం. జి. యం. వారి "జూలియస్ సీజర్"

మూడువందలయేభై సంవత్సరాలక్రిందట రచించినా నేటికీ అద్వితీయమై నిలిచిన షేక్స్పియర్ నాటకాలు ప్రజలను రంజింప చేస్తూనే ఉన్నాయి ఇన్ని యేళ్ళుగా సారస్వతం, నాటకకళ ఎన్ని విధాల అభివృద్ధి చెందినా అటువంటి నాటకాలు మాత్రం మళ్ళీ రచించబడలేదు ఈ శతాబ్దంలో విశేషవ్యాప్తిలోకి వచ్చి ఎంతో అభివృద్ధిచెందిన చలనచిత్ర కళలో కూడా షేక్స్పియర్ నాటకాలకు ఉన్నత స్థానం లభించింది

షేక్స్పియర్ నాటకాలను సినిమాలుగా తియ్యడంలో బ్రిటిష్ వారిదే పైచెయ్యి ఇటీవల అమెరికాలో తయారైన మెట్రో గోల్డ్విన్ మెయర్స్ వారి "జూలియస్ సీజర్" కూడా సుమారుగా బ్రిటిష్ చిత్రాల స్థాయికివచ్చింది రెండుసార్లు ఆస్కార్ బహుమతులు పొందిన హాలీవుడ్ డైరెక్టర్ జోసెఫ్ యల్ మాంకీ విజ్ ఈ చిత్రాన్ని డైరెక్ట్ చేశాడు సినిమాలలో అడుగిడుతూనే నటనాకౌశలానికి ఆస్కార్ బహుమతిని పొందిన మార్లన్ బ్రాండో మార్క్ ఆంటోనీ పాత్ర ధరించాడు జూలియస్ సీజర్ గా లూయీ కాల్హెర్న్, బ్రూటస్ గా జేమ్స్ మేసన్, సీజర్ భార్య కాల్ఫర్నియా పాత్రను గ్రీర్ గార్సన్, పోర్షియాగా డెబోరా కెర్ నటించారు షేక్స్పియర్ నాటకాన్ని యథాతథంగా ఏలాటి మార్పులూ లేకుండా నాటకరంగంపైన ప్రదర్శించినట్లే కథాగమనవేగం చెడకుండా చిత్రం తీయబడింది రంగంమీద ప్రదర్శనలో మాదిరే పాత్రపోషణకు ప్రాధాన్యత ఇవ్వబడింది పాత్రపోషణ అనేకోభ్యాగాలు ప్రజల ప్రశంసన, ఉపన్యాసాల బలంతో సాగిన జూలియస్ సీజర్ నాటకం యథాతథంగా ఈ సినిమాలో చిత్రించబడింది షేక్స్పియర్ రచనలోని బ్లాంక్ వెర్స్ సినిమా చిత్రణలో బాధించలేదు సరిగదా నాటకీయ ప్రాబల్యానికి మరింత తోడ్పడింది ★

# సినిమా వార్తలు

ఆహ్లాద్ చిత్రావారి "సుహాగన్" గతవారం ఆంధ్రదేశంలో విడుదలయింది 'మహాత్మా' 'నన్హే మున్నే' మొదలైన చిత్రాలను నిర్మించిన శ్రీ దత్తాధర్మాధికారియే ఈ చిత్రాన్ని నిర్మించారు దర్శకుడు అనంత్ మానే, సంగీత దర్శకుడు వసంత్, రామచంద్ర సినిమాలు చూసి చూసి వాటిలో నటించాలనే వ్యామోహంతో మిత్రుల సహాయంతో భర్తనూ ఇంటినీ విడిచి బొంబాయివెళ్ళి అక్కడ ఊబిలో చిక్కుపడిన రాధ అనే ఒక మధ్యతరగతి యువతికి సంబంధించినది కథ ఈ చిత్రంలో గీతాబాలి, విజయలక్ష్మి, సులోచన, జస్వంత్, శ్యాంకుమార్ మొదలైనవారు నటించారు లతామంగేష్కర్, ఆశాభోస్లే, గీతారాయ్ తలత్ మహమూద్ నేపథ్య గాయకులు డి స్ట్రి బ్యూటర్లు చంద్రమియా

* * *

మానవనైజాన్ని ప్రతిబింబించడం అప్రధానంగా ఏదో సైకాలజీ, సైకియాట్రీ, మిసరీ, క్రైమ్, వైల్డ్ వెస్ట్, మ్యూజికల్ కామికల్, సోఫిస్టో కామికల్ వగైరా హాలీవుడ్ మార్కు చిత్రాలతో విసుగెత్తిన వారికో మంచివార్త ఇటలీ, జపాన్, రష్యా, ఫ్రాన్సు, జర్మనీ, కకోస్లావాకియా, అర్జెంటినా దేశాలలో తయారైన చిత్రాలను దిగుమతి చెయ్యడానికిగాను శ్రీ ప్రభాత్ ముఖర్జీ (కలకత్తా) ఒక ఏజన్సీ స్థాపిస్తున్నారు

ఇటలీలో చలనచిత్ర నిర్మాణం 50 ఏళ్ళ క్రింద ప్రారంభమైంది హాలీవుడ్ ఇంత ఉధృతంగా అపారమైన నిర్మాణకౌశలంతో చలనచిత్రజగతులో ముందడుగు పెట్టక ముందే ఇటలీలో "క్వోవాడిస్" వంటి చిత్రాలు తయారైనాయి (ఇది ఇటీవల విడుదలైన టెక్నికలర్ చిత్రం 'క్వో వాడిస్' కాదు అసలు చిత్రం 1913 లో ఇటలీలో తయారయింది ) కాని ప్రపంచయుద్ధాల వల్ల ఇటలీలో చిత్రపరిశ్రమ దెబ్బ తిన్నది. రెండో ప్రపంచయుద్ధంతరవాత మళ్ళీ ఇటలీ సినిమారంగంలో ఉత్తమస్థానం సంపాదించుకుంది ఇటాలియన్ చిత్రాలు భారత దేశానికి దిగిదిగా రాకపోయినా ఇదివరలో

పారమౌంట్ వారి 'మని ఫ్రమ్ హోమ్'లో జెర్రీలూయీ, పాట్ క్రౌలి

★

యునైటెడ్ టెక్నీషియన్స్ అండ్ శ్యామలా వారి "పెత్తందారు"లో సి. యస్. ఆర్



# ★ సూరయ్య నిర్ణయం ★

(10-వ పేజీ తరువాయి)

భార్యను లేపడానికి సాహసం చాలక అలాగే తిరిగివచ్చి, పెద్ద నిట్టూర్పు విడిచి మంచంమీద వాలాడు డొక్కలు మాడుతుండడంవల్ల నిద్రపట్టలేదు, దానికి తోడు మధ్యమధ్య భార్య తెచ్చుకున్న మూలుగు గుండెను స్తంభింపజేస్తోంది మర్నాడు ఎలా తెలవారుతుందో అని ఆలోచిస్తూ ఉండగానే ఎప్పుడు నిద్రపట్టిందో కాని మళ్ళీ మెలకువ వచ్చేసరికి భళ్లున తెల్లవారింది మామూలుగానే లేవబోయాడు కాని గత రాత్రి విషయం జ్ఞాపకంవచ్చి మళ్ళీ వెనక్కి పడిపోయాడు ఎప్పుడూ నిద్రలోనే గడచిపోతే బాగుండు ననిపించింది అతనికి ఇంతలో వంటింట్లో నుంచి ఏదో గొడవ వినిపించింది పిల్లల ఏడ్పులూ గిన్నెల మోతలూ, పెళ్ళాం కేకలూ విని మంచంమీదనుంచి ఒక్క గంతువేసి దొడ్లోకి పరుగెత్తి, మొగం కడుక్కొని, నీళ్లుపోసుకొని కాఫీకోసం ఎదురుచూశాడు కాఫీ రాలేదు పరిస్థితి దుర్భరమైపోతోంది మెల్లగా వంటింటి గుమ్మం దగ్గరకు నడచి "అయితే–" అని ఆగిపోయాడు

భార్య అతనికేసి ఒక్కసారి తీక్షంగా చూసి ఊరుకుంది

"యజమానితో మాట్లాడితే—"

"మాట్లాడితే ఏమిటి మాట్లాడి తగలబడమనే అంటున్నాను—"

"—లాభం ఉంటుందా అని?—"

"లాభం ఉంటుందో లేదో జోస్యం చెప్పడానికి ఎవరు కూర్చున్నారు పోయి మాట్లాడడానికేం? మీదబడి మింగివేయడు కదా!"

"ఒకవేళ ఉద్యోగంనుంచి తీసివేస్తానంటే?"

"హడలిపోతూ మాట్లాడితే అలాగే అంటాడు తప్పకండా మెత్తని వాడిని చూస్తేనే మొత్తబుద్ధివేస్తుంది అక్కడకు పోయి బీద అరుపులేమీ అరవనక్కరలేదు ధైర్యంగా వెళ్ళి, 'నాకు జీతం పెంచితేనే ఈ ఉద్యోగం చేస్తాను, లేకపోతే చేయను, నాకు వేరే మంచి అవకాశాలు వస్తున్నాయి' అని తెగవేసి చెప్తే, చచ్చినట్లు ఒప్పుకుంటాడు, ఎంత యజమాని అయినా"

"నెపుతే నమ్మవద్దూ?"

"నమ్మకేం జేస్తాడూ? బుకాయిస్తే సరి"

బుకాయింపే! తను జన్మ ఎత్తి ఎరుగునా! తన స్వభావానికి అది అసంభవం కాబట్టి మాట్లాడకుండా ఊరుకున్నాడతను

మనదే పైచేయి అన్నట్లుగా ఉండాలి అప్పుడు ఎవడూ ఎదురుచెప్పలేడు మీకు మరో ఉదోగ్యం దొరకదని భయపడనక్కర్లేదు ఈమాత్రం నౌకరీ ఎక్కడైనా దొరుకుతుంది ఎవడైనా మీవంటి వాళ్ళను కళ్ళకద్దుకుని తీసుకుంటాడు" అంది ఆమె భర్త నెగ్గో అలాగ వెళ్లేటట్లు చేయాలనే పట్టుదలతో

ఆ మాటలు వింటూంటే సూరయ్యకు కూడా తన భార్య చెప్పినది నిజమే అని తోచసాగింది ఒకమూల బెదురుతో గుండె దడదడ కొట్టుకుంటూన్నా, వేరొక వైపు భార్య చెప్పినట్లు వెళ్ళి మాటాడితే పని అవుతుందేమో నన్న ఆశకూడా బయలుదేరింది నిజంగా తన అవసరం యజమానికి చాలా ఉన్నట్లూ, యజమాని తనను వదులుకోజాలడన్నట్లూ, తోచసాగింది

"అయితే వెళ్ళి మాట్లాడుతాను" అన్నాడాఖరికి

ఆమాట అనేసరికి ఇంట్లో వాతావరణం ఇట్టే మారిపోయింది భార్య మొగం మీద మబ్బులన్నీ మాయమైపోయాయి ఆమె ఎంతో ప్రేమ పొంగిపోతున్నట్లు గబగబా కాఫీ కాచి యిచ్చింది ఎన్నడూ లేనిది రెండు పూరీలుకూడా వేగించి ఇచ్చింది ఆవి తింటూంటే సూరయ్యకు ఆత్మవిశ్వాసం పెరగసాగింది నిజంగా, తనకు ఎక్కడ పడితే అక్కడ ఇట్టే ఉద్యోగం దొరుకుతుంది, తనే యజమాని షరతులు చెప్పగలడనిపించిందికూడా ఈ ఆత్మవిశ్వాసం ఎంతవరకూ పెరిగిందంటే, చివరకు పిల్లలు చాలా గోలచేస్తూంటే రెండోవాడిని పట్టుకొని నడ్డివంచి గట్టిగా దబదబా నాలుగు వేసేశాడు ఇంతకుముందెన్నడూ అతను అలా కొట్టి ఎరగడు ఎప్పుడైనా ఖర్మంజాలక చేయిజేసుకున్నా పిల్లలు మరి కొత్తరెచ్చిపోయేవారు లేకపోతే తల్లిదగ్గరకు పోయి ఫిర్యాదు చేసేవారు అటువంటిది ఈనాడు తండ్రి అలా కొట్టేటప్పటికి రెండోవాడు కిమ్మనకుండా ఊరుకున్నాడు

మిగతాపిల్లలుకూడా గప్‌చుప్‌గా ఉండిపోయారు తన ప్రతాపానికి తనే ఆశ్చర్యపోయాడు సూరయ్య ఇన్నాళ్లూ తను మెత్తమెత్తగా ఉండబట్టే అందరూ తనమీద స్వారీచేసేవారు కాని ఇప్పుడు కాస్త కరుకుగా వ్యవహరించేసరికి అందరూ తనంటే జాగ్రతగా ఉంటారు తను గట్టిగా మాట్లాడితే యజమానికూడా లొంగిరాక తప్పదు అన్న నమ్మకం దృఢమైంది

యజమాని ఆఊళ్లో ఉండడు ఆ ఊరికి ఎనిమిదిమైళ్ళదూరంలో తోటలమధ్య పెద్ద బంగాళాలో ఉంటాడు ఆయనకు రెండు కార్లు ఉన్నాయి కాబట్టి ఎక్కడ ఉన్నా పరవాలేదు ఆయనదగ్గరకు పోవాలంటే రైలుమీదవెళ్లాలి అందువల్ల ఆఫీసుకు సెలవ రాసి పంపించి వేశాడు సూరయ్య భోజనం చేశాడు మంచి దుస్తులు వేసుకొని రీవిగానే వెళ్ళమని సలహా యిచ్చింది భార్య ప్రక్క ఇంటి ఆయనను అడిగి మంచికోటు ఒకటి తెప్పించుకొని తొడుక్కున్నాడతను రిక్షా వచ్చింది తయారై రిక్షా ఎక్కాడు సూరయ్య ఎన్నడూ లేని అనురాగం తెచ్చుకొని "వెళ్లిరండి" అంది భార్య రిక్షా ఎత్తుకున్నాడు రిక్షావాలా హఠాత్తుగా 'ఆగు' అన్నాడు సూరయ్య రిక్షా దించాడు ఆమనిషి "ఎందు"కంది భార్య ఆశ్చర్యపోతూ, మళ్లీ వెనక తీస్తాడేమోనని "చేతిబెత్తం కూడా తీసుకువెళ్తే ఎక్కువ రీవిగా ఉంటుంది కాదూ" అన్నాడు సూరయ్య చేతి బెత్తం - ప్రక్క ఇంటి ఆయనది - తీసుకు వచ్చారు పిల్లలు "కళ్లజోడో?" కళ్లజోడు కూడా వచ్చింది అది తగిలించుకొని, కోటు సవరించుకొని, చేతి

## సినిమా వార్తలు

కంటె తరుచు వస్తాయి 1951 వెనిస్ ఫెసివల్‌లో బహుమతిపొందిన "రోడ్‌ టుహోప్" త్వరలోనే భారతదేశంలో విడుదలౌతుంది

*　　*　　*

ఇటీవల లండన్‌లో రెండు మాసాలు పైగా ప్రేక్షకుల్ని ఒక సైలెంట్ ఫిలిమ్ ఆకర్షించింది. చార్లీ చాప్లిన్ సైలెంట్ చిత్రాలుకూడా ఇప్పటికీ ప్రజల్ని ఆకర్షిస్తున్నమాట నిజమే కాని రెండో ప్రపంచ యుద్ధానికి పూర్వం చలనచిత్ర కళాభివృద్ధికి ఎంతో తోడ్పడిన ఐజెన్‌స్టీన్ చిత్రాలమాట వేరు లండన్ ప్రేక్షకులనాకర్షించినది ఐజెన్‌స్టీన్ చిత్రం "బాటిల్‌షిప్ పోటెమ్‌టిన్" ఆ చిత్రంలో ఐజెన్‌స్టీన్ చూపిన కళాప్రావీణ్యం నేటికీ చిత్ర నిర్మాతలకు ఆశ్చర్యం కలిగిస్తున్నదని న్యూస్టేట్స్‌మన్ ఎండ్ నేషన్‌లో విలియమ్ వైట్ బెయిట్ వ్రాశాడు చలనచిత్ర పరిశ్రమలో కృషి చెయ్య దల్చుకున్న ప్రతి వ్యక్తి ఈ చిత్రాన్ని విధిగా శ్రద్ధగా పరిశీలించాలనికూడా వ్రాశాడు ★

#  కల - ఇల - కథ! 

(11-వ పేజీ తరువాయి)

వుస్తారు. అది ఖుల్లీ ఖుల్లీ ఏడుస్తుంది చీకి చీకి చస్తుంది అంతే!

అంతే! తనకూ రవణమ్మకు ఋణం తీరిపోయింది ఇంత జరిగాక ఏమీ తెలీనట్టే మళ్ళీ రవణమ్మ దగరకు పోలేదు పోక వేళపోయినా రవణమ్మ తన్ను వళ్ళోకి లాక్కుంటూ గోముగా ఆ మాటలే అంటుంది! ఆ రాత్రి పరాయి మొగాడితో అన్నట్టే అంటుంది. ఎంత మోసం?

ఆడది ఎంత మోసాన్ని, కుట్రను హృదయంలో దాచుకొంటుంది! అప్పుడు రవణమ్మను వరికేస్తాడు తన్ను తను నరుక్కుంటాడు.

ఛీ! దాని మొహాం యిహ చూడలేడు దాని స్పర్శ తనకు చీదర పుడుతుంది రవణమ్మను గురించిన వూహాలకే తన వంటిమీద తేళ్లు, జెర్రులూ పాకినట్టుగావుంది ఒళ్లు కంపరమెత్తి పోతోంది తనకీ రవణమ్మకూ యిహ ఏ సంబంధమూ లేదు తనకు యీ ప్రపంచంలో యింకేమీ అవసరం లేదు

---

బెత్తం పట్టుకొని మహారీవిగా కూర్చున్నాడు సూరయ్య, తను ఆఫీసరు అయిపోయినట్లు ఊహించుకుంటూ రిక్షా కదిలింది భార్యవైపు తిరిగి గంభీరంగా తల ఊపాడు వెళ్ళొస్తావన్నట్లు

రిక్షా వీధి మలుపు తిరిగింది భార్యా, ఇల్లూ కనబడకపోయేసరికి అణగిపోయాయనుకున్న అనుమానాలు తిరిగి పైకి లేవసాగాయి ఇంటికి దూరమవుతున్న కొద్దీ వాటిజోరు కూడా హెచ్చసాగింది ఆత్మవిశ్వాసం ఇంకి పోసాగింది స్టేషను చేరే వేళకు ఎప్పటి మేకపల్లే అయిపోయాడతను భయాందోళనలలో స్టేషను వచ్చింది దిగాలన్నమాటే మరచిపోయాడు రిక్షావాడు చెప్పగా అదిరిపడి బయటకురికి, వాడికియ్యవలసిన బాడుగ వణుకుతూ ఇచ్చివేసి ఖంగారుగా స్టేషనులో అడుగు పెట్టాడు ఇంటిదగ్గర భార్య మాటలు అంత ధైర్యం కలిగించాయి కాని ఇప్పుడు అవే మాటలు తలచుకున్నా అతనికేమీ ధైర్యం చిక్కడం లేదు యజమాని ముందు నోరు విప్ప గలడన్నది అనుమానంగా కనుపిస్తోంది దైవకృపవలన మాటవచ్చి, పెళ్లాం చెప్పినట్లు మాట్లాడితే యజమానికి కోపం వస్తుంది మేనేజరుకు అంతకుముందే కోపం వచ్చి ఉంటుంది. ఇద్దరి కోపాలు ఏకమై తనకు ఉద్యోగం ఊడేటట్లు చేస్తాయి తనకు మరోచోటు దొరుకుతుందని భార్య అంటుంది అనుకున్నాడు కాని ఇప్పుడు ఆలోచించగా అది వట్టిగాలిలో మేడలా కనుపిస్తోంది ఇప్పటికే - ఈ జీతంమీదే సంసారం గడవడం కష్టంగా ఉంది రేపు ఈ జీతంకూడా ఆగిపోతే సంసారం మాట ఏమిటి? అందరూ తననే అంటారు ఫలితం ముఖ్యంగా తనే అనుభవించవలసి వస్తుంది ఇంటికి తిరిగి పోదామంటే అదీ కుదరదు తనలాగే బుకాయించాలంటుంది భార్య కాని ఎదుటివాడి ప్రకృతి తనదానివంటిది కాదనేది ఆమె కర్థంకాదు వెళ్లి, మాట్లాడి చూడమంటుంది - అంతే వెళ్లి మాట్లాడితే?

స్టేషనులో టిక్కట్లు ఇస్తున్నాడు 'క్యూ' సూరయ్యవరకూ కూడా వచ్చివేసింది అనుకోకుండానే అతను 'క్యూ'లో ఒకడైపోయాడు అతని వెనకాల కూడా కొందరు నిలబడ్డారు 'క్యూ' అతనిని ముందుకు లాగుకుపోయింది టికెట్టు కొని ప్లాటుఫారమ్‌మీదకి నడిచాడు కోటూ, బెత్తమూ కళ్లజోడూ ఇప్పుడు చెడ్డ బరువులా తోస్తున్నాయి అతనికి కొదిసేపు ఏ ఖాళీ ట్రాలీబండిమీదో కూర్చుంటూ, కొంతసేపు లేచి అటూ ఇటూ తిరుగుతూ, మళ్ళీ కూర్చుంటూ, మళ్ళీ లేస్తూ ఉన్నాడు సూరయ్య గంట మోగింది జనం లేచి ప్లాటుఫారమ్ ఎదరకు పోయి నిలబడ్డారు వాళ్ళతోబాటు సూరయ్య కూడా పోయి నిలబడ్డాడు బండికూత వినిపించింది

బండి వస్తోంది వేగంగా అంతకంతకు పెద్దదైపోతూ పెనుభూతంలా వచ్చివేస్తోంది రైలుబండి

*　　　*　　　*

మరికొంతసేపటికి సూరయ్య ఇంటిముందు పోలీసువాను వచ్చి ఆగింది ఇద్దరు పోలీసులు బయటకు దిగి తలుపు తట్టారు సూరయ్య భార్య తలుపు తెరిచింది పోలీసుల్ని చూసి కొయ్యబారిపోయింది పోలీసులన్నారు, "సూరయ్యగారిల్లు ఇదేనా అండి?" తల ఊపిందామె "ఆయన భార్యగారు మీరేనా అండి?" అవునంది ఆమె

"ఒకసారి ఆసుపత్రికి వస్తారా? ఇందాకా రైలుక్రిందకు ఒకరు దూకేరు దూకింది సూరయ్యగారేనేమో శవాన్ని గుర్తుపట్టడానికి—"

*　　　*　　　*

సూరయ్య తన జీవితంలో చేసిన ఏకైక నిర్ణయం అదేనన్నమాట! ★

జీవితంమీద రోతపుట్టినవాళ్లు భరించరాని బాధలతో అలమటించిపోయేవాళ్లంతా ఏం చేస్తారో తనూ అదే చేస్తాడు

రైలుకింద తలకాయలు పెట్టేవాళ్ళు, రాళ్లు కట్టుకొని భావుల్లో దూకేవాళ్ళూ, కిరసనాయిల్ డబ్బా నెత్తిన పోసుకుని నిప్పు ముట్టించుకొనేవాళ్లు, గుక్కెడు విషాన్ని గుటుక్కున మింగేవాళ్ళూ, ఇంటి కప్పు దూలాలకు వ్రేలాడేవాళ్ళూ అంతా ఆనందరావు కళ్లముందు కదిలారు వాళ్లంతా తనకు యీ నరకంనుంచి విముక్తిమార్గాన్ని చూపిస్తోన్నారు

అంతవరకూ వాళ్లంతా ఎందుకు అలా చూస్తూ చూస్తూ నిండు జీవితాల్ని బలియిస్తారో అర్థం కాలేదు నిజంగా వాళ్లే తెలివికలవాళ్లు జీవితంలో సాధించకలిగిందీ, అనుభవించగలిగిందీ ఏమీ లేనప్పుడూ, పుట్టెడు దుఃఖంతో, నరకంలో మగ్గిపోయేకంటే అలా జీవితంనుంచి వైదొలగడమే మేలు

బయట మంచును తోసుకొంటూ చలిగాలి మెల్లగా వీస్తోంది చీకటిలో దోవచేసుకొంటూ బండి పరిగెత్తుతోంది ఆనందరావు కూర్చున్న చోటునుంచి కదలకుండా కిటికీలోంచి బయటికి చూశాడు చేలూ, తాటిచెట్లూ సరివితోపులూ మసక మసగ్గా కనపడి వెనక్కు పోతున్నాయి రైలుపెట్టెల్లోని వెలుతురు రైలుకట్టకిందనే వున్న పొదలపైన చిన్న చిన్న గుబురుచెట్లపైన పడి కనపడుతూ అంతలో చీకట్లో మాయమవుతూ వున్నై

అంతలో బండి వెంకటాచలం స్టేషన్లో ఆగింది అక్కడ సుమారుగా పదిమందిదాకా పెట్టెలో ఎక్కి, ఆనందరావుకు ఎదురుగా వున్న బల్లలపై సామానూ అవీ సర్దుకుని కూర్చొన్నారు

ఆనందరావు అప్పుడే రాసి పూర్తిచేసిన వుత్తరాన్ని మడతబెట్టి, ఒక కవరుల్లో పెట్టి భార్య రవణమ్మ అడ్రసు రాసి, బండి దిగి స్టేషన్‌లోవున్న పోష్టుపెట్టెలో వేసి మళ్ళీ ఎక్కాడు అంతకుముందు తను కూర్చునిపోయిన చోటు అలాగే ఖాళీగా తనకోసం ఎదురుచూస్తోన్నట్టుగా వుంది అవును! యింకో గంటకు మళ్ళీ ఖాళీ అవుతుంది! కాని మళ్లీ అక్కడ కూర్చోడానికి ఆనందరావు వుండడు!! అనుకుంటూ ఆనందరావు పోయి నీరసంగా అక్కడే కూర్చున్నాడు

బండి వెంకటాచలం స్టేషన్నుంచి కదిలింది

ఆనందరావుకు ఎదురుగా కూర్చున్న వాళ్ళు గలిబిలిగా మాట్లాడటం మొదలుపెట్టారు అవుత్సాహం, ఆనందడీ,

# కల - ఇల - కథ!

వాళ్ళ సంభాషణా అతడి మనసుకు అంతగా పట్టించుకోకపోయినా, "పెళ్ళికొడుకూ - పెళ్ళికూతురు" అని సంభాషణ మధ్యమధ్య వినిపిస్తోన్న మాటలు చెవుల్లో దూరి విరిగిపోయిన ఆనందరావు మనసులో కలవరాన్ని కలిగిస్తోన్నాయి

తలవంచుకొని కూర్చొన్న ఆనందరావు దృష్టి తన కెదురగా కూర్చున్న పిల్ల కాళ్ళపై పడింది

ఆ కాళ్ళనున్న పారాణీ, మట్టెలు వెళ్ళేళ్ళు ఆనందరావు స్మృతిపథంలో తరంగాల్ని లేపినై

ఆనాడు, పెళ్ళయాక పెళ్ళికూతురుతో తరలివస్తో, రైల్లో తన రమణమ్మ కాళ్ళకేసి తనెలా చూశాడు? ఎంత అందంగా వున్నాయి? పారాణి పెట్టి, గొణ్ణెపు గొలుసులతో మిసమిసలాడుతూన్న రమణమ్మ పాదాల్ని రెండు చేతుల్తో ఎత్తి హృదయంలో దాచుకుందా మనుకోలా?

తను అలా చూస్తోన్నది గ్రహించి సిగ్గు దొంతర్లలో తలను వంచేసి పాదాల్ని పట్టుచీరల మడతల్లోకి లాక్కుంది గదూ రమణమ్మ అట్టాంటి రమణమ్మ యీ పని—

"ఏడదాకా పోతుండారయ్యా!" వెన్నున చరిచినట్టయి వులిక్కిపడి పారాణి పెట్టిన పాదాలపైనుంచి దృష్టి మళ్ళించి తల పైకెత్తి చూశాడు ఆనందరావు

దాదాపు ముప్ఫై సంవత్సరాల వయసులోవున్న దృఢకాయుడు జరీఅంచు కొత్తకండువాను సద్దుకుంటూ అదే ధోరణిలో అడిగేడు

"ఏడదాకా పోతుండారు?" తనను ప్రశ్నించిన మనిషిని దీక్షగా చూశాడు

కాళ్లకు కిర్రుచెప్పులూ, కొత్తపంచలూ, తలగుడ్డా, కొద్దిగా ముదిరిన యవ్వనంలో మాంచి పెళ్ళిజోరులో వున్నాడు మనిషి అతడి వాలకం చూస్తే మళ్ళీ అడక్కుండా వుండేట్టు లేదు

"తెనాలిదాకా!" నసిగాడు ఆనందరావు

"ఏడనుంచి వత్తుండారూ?" ఈసారి విసుగు పుట్టింది ఆనందరావుకు మాట్లాడకుండా బిగదీసుక్కూర్చున్నాడు "పెళ్లి చేసుకొని పోతున్నవాడు పోక చావబోయేవాడితో తన కెందుకూ?" అనుకొన్నాడు

"మిమ్మల్ని యాడో చూసినట్టుగా వుందే?" మళ్ళీ అన్నాడు అతడు

తను మాట్లాడకుండా బిగించికొని కూర్చున్నా, పల్కరిస్తోన్న అతడ్ని చూస్తే కోపం పోయి, అతడి అమాయకత్వానికి జాలి వేసింది ఆనందరావుకు.

"మీ దేవూరూ?" అడిగింది చెప్పకుండానే అడిగాడు ఆనందరావు

"మాదేమో పోతుతోజా పాలెం అండయ్యా! వక్కల గూడెంలో పెళ్ళి చేసుకు వత్తుండాం?" మీసం దువ్వుకుంటూ తనకు కుడిపక్కగా కూర్చున్న పెళ్లికూతురు వైపు చూశాడు ఆ మాట చెప్పడానికే ఎదురు చూస్తున్నట్టుగా అని

పెళ్లికూతురు పదిహేనూ, పదహారు వయసులో పల్లగా నిగనిగలాడుతూ వుంది తరంబరాలు పోసిన పసుపు పచ్చని చీర మీద వెండిగజ్జల వడ్డాణం మెరుస్తోంది ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ పెళ్లికొడుకునూ, ఆనందరావునూ చూస్తో మధ్యమధ్య పైట లాక్కొని వడ్డాణం సర్దుకొంటూ కూర్చునివుంది

"ఓహో! అలాగా!" అన్నాడు ఆనందరావు పెళ్ళికూతుర్ని చూస్తో

"తము రేం జేత్తుండారూ?" అడిగాడు అతడు

తనేం చేస్తున్నాడూ? చావడానికి ప్రయత్నం చేస్తున్నాడు! అంతేగా? తనలో తనకే నవ్వొచ్చింది ఆనందరావుకు

"నువ్వేం పనిచేస్తావ్?" అడిగాడు ఆనందరావు

"మాకేం పనులుండాయ్? కూలీ నాలేగా? యీ యేడు పసుపుతోటల్లో కూలి బాగా గిట్టిందిలేండి అది పెట్టే యిప్పుడీ పెళ్ళి చేసుకొన్నా! దీనికి నాలుగు వరాలు వోలిచ్చి చేసుకొన్నా!"

బీడీ తీసి వెలిగించి రెండుగుక్కలు లాగి మళ్ళీ అన్నాడు

"నా మొదటి పెళ్లాన్ని ఏడువరాలిచ్చి చేసుకొన్నా! అయితే దీనికంటే అది కూసైగెరు కాని—" నసిగాడు పెళ్లికొడుకు

"అయితే నీ కిది రెండో పెళ్లా?" అడిగాడు ఆనందరావు

"అవునండయ్యా!"

"మరి నీ మొదటి పెళ్ళాం?" సాలోచనగా అడిగాడు ఆనందరావు 'తన పెళ్లాం రమణమ్మలా వాడి పెళ్లాం కూడా—' ఆ ఆలోచనలో ఆనందరావుకు ఏదో ఆనందం ఆశ కొరికింది

"అదా?"

"ఆఁ" అని నోరు తెరిచాడు ఆశా నిరాశల్లో పడి అసందిగ్ధమయిన ఆలోచన— వాడి పెళ్లాం చనిపోయిందా? లేచిపోయిందా?

"దాని సిగ తరిగిరి' దాని బుద్ది [illegible] పోతురు జబిరి బయటికి యీడిరా! ఆ [illegible] కోటాయిగాడ్ని తీసుకొని ఎటో లేసిపో యింది!"

ఆనందరావుకు గుండెల్లో కలుక్కుమంది గుండె వొక 'ఢీక్' తప్పుకొన్నట్టయింది తల్లో చేరిన దిమ్ము, హృదయంలోని బరువూ తప్పుకుపోతూన్నట్టు [illegible] వుంది

"ఏంటి? పెళ్ళాం లేచిపోతే మళ్ళీ చేసుకొన్నా వన్నమాట!"

"అవునండయ్యా! నేనసలు జానిక్కుచ్చి మనిషిని! ఇదైనా యాడన్నా మెలిక [illegible] చూపితే ఒక జబురు జబిరి తోలేత్తా!" మీసం మెలేశాడు పెళ్ళాంవంక చూ[illegible]

కసుక్కున నవ్వి ముఖాం పైటచాటు[illegible] దాచుకుంది పిల్ల

"మొగాడికేమయ్యా! రాజా! వొకటి కాకపోతే యింకోటి! పసుపు తోట[illegible] బాగా పండి కూలి దొరికితే ఏడాది [illegible] గొచ్చేసరికి పదొరాలు యెనకేసుకో [illegible] పదొరాలు వోలి పెట్టె దవకన్నెళ్ళ [illegible] కోవచ్చు!"

వింటూ ఆనందరావు ఆలోచనలో పడి పోయాడు - బండి పెన్నానది బ్రిడ్జిమీదుగ [illegible] పోతోంది

ఆనందరావు కళ్లు చెమ్మగిల్లాయి [illegible] గిల్లిన కళ్ళల్లో కాంతి వెల్లువ [illegible] బీటలువారిన హృదయం చిగురించింది ఆశలు పూలు పూసినై

"చెడిపోయినవాళ్లకోసం మనం చివ[illegible] లెందుకు చావాలి?" అన్నాడు [illegible] ఆనందరావు అప్రయత్నంగా

బండి పెన్నానది బ్రిడ్జిదాటి [illegible] పెట్టుకొంటూ చీకటిని చీల్చుకొం[illegible] పోయింది

* *

ఆనందరావు వెంకటాచలం స్టేషన్లో పోష్టుచేసిన కవరుమాత్రమే రమణమ్మ[illegible] అందింది శివరం అంతుదొరక లేదు.

* *

కొన్నేళ్ళతర్వాత—

యౌవ్వనంలోంచి వో కాలు [illegible] పెటిన వితంతువు రమణమ్మ, తల నున్న[illegible] చెక్కించుకొని, కావిరంగు ఏనుగజాల మల్[illegible] పంచతో చీర రవికా వుండాల్సిన [illegible] రానికి చుట్టుకొని, కాళీఘాట్లో [illegible] పవిత్రగంగానదీజాలాల్లో తన పాపాన్ని [illegible] గేసుకుంటుండగా దారినే వొక [illegible] తితో కలిసిపోతోన్న వొకాయన అగి [illegible] క్షగా చూశాడు

పక్కనే వున్న నవయువతి అతని చేయి పట్టుకొని లాగుతూ—

"కమాన్ డియర్!" అంది.

"రవణమ్మా!!!" అప్రయత్నంగా అన్నాడు అతను.

"ఎవరూ?" అంది ఆవిడ.

"కడిగేసుకొంటూంది!" అన్నాడు అతను.

"పాపాన్ని!" అంది ఆమె.

"కాదు! మురికి!"

* * *

రవణమ్మ కథ ముగించి రాత్రి వంటి గంటకు ముసుకుతన్ని పడుకొన్నాడు కథకుడు.

"ఛీ! నీ అరసు పగలు! సిగ్గులేకుండా నిద్దరపోతున్నావ్!"

"ఎవరూ నువ్వు?" కథకుడు కళ్ళు నులుపుకొంటూ లేచికూర్చున్నాడు.

"గుర్తులేదూ? అప్పుడే మర్చిపోయావ్? నీ ముసుక్కూడా!"

"ఏయ్ ఎందుకూ తిడతావ్?"

"ఎందుకా? అందుకే! నీ కలం యిరగ! కాగితాలు చిరగ! నీ కథలు మండ!!"

"ఏయ్! ఎవరు నువ్వూ?"

"నేనూ నీ కథానాయకిని!"

"ఆఁ! రవణమ్మవా?"

"ఆఁ. రవణమ్మనే!"

"అయితే యీ వేషం ఏమిటి? ముత్తైదువు వేషమూ నువ్వు! తల గొరిగించుకొని గంగలో మునుగుతున్నావుగా?"

"ఆ మునుగుతోంది నా చెల్లెలు కామాయి!"

"ఆఁ — నీ మొగుడు ఆనందరావే చూసి అన్నాడుగా? 'రవణమ్మే!' అని"

"ఆఁ. అన్నాడులే! ఆ రోజు రాత్రి అలాగే అనుకొన్నాడు మా చెల్లెలు, దాని ప్రియుడు రామచంద్రయ్యతో వుండటం చూశాడు. తర్వాత అది రామచంద్రయ్యనే చేసుకొంది కొన్నాళ్లకు మొగుడు చని పోయి విధవయింది!"

"ఆఁ!" కథకుడు నోరు తెరిచాడు.

"మరి నువ్వో-"

"నేనే! ఆయన వుత్తరం అందగానే అబ్బ! ఎంత నీచంగా రాశాడు? ఆయన నిజంగా పెన్నానదిలో బడి చనిపోయాడనుకొన్నాను

నా భర్తా, లోకం, నువ్వూ కలసి నా మీద వేసిన నిందను మోయలేక మా దొడ్లో వున్న భావిలో—"

"భావిలో దూకావా? మరి బతికే వున్నట్టుగా వున్నావుగా?"

"అకాలంతం చావు చచ్చినవాళ్లు ప్రేతాత్మలు తీరని కోరికలతో తిరుగుతూంటాయని తెలియదూ?"

"ఆఁ! అయితే నువ్వు దెయ్యానివా?"

"ఛీ! నువ్వే దెయ్యానివి! నువ్వే భూతానివి! నువ్వు నన్ను అన్యాయం చేసి నా కుర్ర పోసుకొన్నావ్! నీకూ, నీ కథ [illegible] తగులుతుందిలే!" [illegible] ఏడుస్తూ [illegible]

కథకుడు లేచి కళ్లు నులుపుకొని రవణమ్మ పోయిన కిటికీవైపే చూస్తూ కూర్చున్నాడు అయితే కిటికీ మూసేవుంది! ★

# యోగాసనములు-దేహారోగ్యము

## 10. విశ్వాసము, నియమానుష్ఠానము.

పాతంజల దర్శనము ఆధారముగా యోగాభ్యాసులకు కొన్ని సూచనలు—

చిలుక పలుకులవంటి పలుకులవలన చిక్కులుపోవని ఎల్లరకు తెలిపిన విషయమే అయినను అట్టి పలుకులనే విని మోసమునకులోనై తన్నులాడుకొనుచున్నాము. ఇందులో ఆశ్చర్యపడవలసినది లేదు.

నిష్కర్షమైన బుద్ధి, తదనుగుణమగు శారీరక క్రియలే మన జీవనమునకు ముఖ్యాధారములని అందరికిని అనుభవమే అయినను నమ్మికలేదని కండ్లు మూసుకొని కూర్చున్నవారెవరని ప్రశ్నించుకొన్నచో; యథార్థము బోధపడగలదు.

నమ్మిక యొక్కటే మన ఆరోగ్యమును చక్కగ కాపాడి ఆయుర్వృద్ధినీ బలమును ప్రసాదించ గల్గునదని వేరే చెప్పవలెనా? కాని ఇదేమాటకు కోపగించుకొని కొంపలు గూల్చు మహానుభావులు ఈ విశాల ప్రపంచములో లేకపోలేదు.

కొన్ని విషయములందు నమ్మకము, కొన్నిటియందు అపనమ్మకము, ఇట్టి వ్యత్యాసభావములు కలవారనేకులున్నారు. వానిని మొదలంట పరిశీలించలేనివారు, చెప్పెడుమాటలు వినువారు తిండిపోతులై సోమరులైనవారికి ఇట్టి వ్యత్యాసభావములు కలుగుచుండును.

మంచి చెడ్డలనునవి మనము నిత్యము చేయు పనులలోనే అనుభవమునకు రాగలవు అరిచేతిలో పెట్టి, చూపుటకు అనుభవములు వస్తువులు గావు అయిననూ అవి వస్తు సంబంధమునకు అత్యంతము భిన్నము గావు. ఇట్లే క్రియలను గురించి గూడ తలచుట మేలు

ఒక మంచిపనిని చేసినచో తత్ఫలితమైన పరిణామము మన శరీరమందు మనస్సు తదితర ఇంద్రియములందును కలుగునుగదా! కాని ఆ ఫలితమునకు మూలరూపమైన బీజమును చూడజాలము, చూపలేము కూడా. దేహేంద్రియ సౌష్టవము దృష్టిగోచరమగును గాని దానిని చేతితో తీసి మరియొకరికి పంచిపెట్టలేముగదా! ఇది యిట్లు తెలిసియు నమ్మకపోయినచో తప్పెవరిది?

భోజన, పాన, శయాన, విహారాదుల గురించి నమ్మకము లేనిచో, ఇంక బ్రతుకెక్కడ? ద్రవ్యార్జన, ప్రతిష్ఠాసంపదభివృద్ధులకై యత్నించునప్పుడు అపనమ్మకము కూడదనియు, అట్టి అపనమ్మకమువలన ఆ సంపదలు లభించవనియు చెప్పుటలేదా? ఇది గూడ నట్టిదే.

రోగములు కొనసాగుచున్నప్పటికిని శరీర వికారాదులను కండ్లారగాంచి తన్నివారణ కొరకు యత్నించు వైద్యులకు తమ చికిత్సా విధానంలో విశ్వాసముండునుగదా అదియే లేనిచో వైద్యులు చికిత్స కొడబడరు; రోగులునూ సమ్మతించరు.

## టి. కృష్ణమాచార్య

రోగములు లెక్కకు మీరియున్నవని ఇదివరలో వ్రాసియున్నాను. ఔషధపానము శస్త్రచికిత్స, సూదుల ప్రయోగముల వలెనే రోగములను నివారించగల అనేక యితర సాధనలు గలవనిగూడ వ్రాసియున్నాను. వానిలో కొన్ని యోగములకు, కొన్ని ఆహారమునకు, మరికొన్ని మంత్రక్రియ, సంగీతక్రియ, జలక్రియ, మృత్తికా క్రియలకు సంబంధించినవి. వారి వారి అభిరుచులకు అనుగుణములైన వానిని వారెంచుకొనినను, వానిలో వారికి విశ్వాస మవసరము పరియైన నియమముల ననుసరించి సాధన సేవలను చేయకున్నచో ఏ పద్ధతివలనగాని రోగనివారణ సాధ్యము కాజాలదు కాని సర్వరోగములకును ఔషధ సేవన యొక్కటే సాధనమని గాని, శస్త్రచికిత్స యొక్కటే సాధనయని గాని ఇట్టి పట్టుదలలు పనికిరావు.

పంచభూతాత్మకమైన ఈ శరీరములు సర్వమూ సమములైనప్పటికిని, అందరి రూప లావణ్య వచనక్రియలు ఏకరీతిగా నుండవనునది ప్రత్యక్ష నిదర్శనమేగదా! ఇంక అట్టి పట్టుదల లెందుకు? మన ప్రాచీన మహర్షులు ప్రతియొక్క దానికిని సాధనలను కనిపెట్టి, ప్రయోగాత్మకముగా నిర్ధారణ చేసి గ్రంథస్థము చేసియున్నారు. వానిని సవిభాగముగా తెలియనివారు అసూయాపరులై సంగదోషమువలననో మరేకారణము చేతనో ఈ సాధనల నొక మూలకు నెట్టి మానవ సౌఖ్యమునకు అభాసము తెచ్చిపెట్టిరని వ్రాయుటకు చింతించుచున్నాను.

సాధన విభాగము సాధ్య విభాగమునకు కారణమగును సాధన మనగా ఉపాయము, సాధ్య మనగా ఫలము. కారణమును బట్టి ఫలితము గలుగును

ఈ యంశములు పాతంజల యోగదర్శనమందు వివరించబడినవి. "శ్రద్ధావీర్యస్మృతి ప్రజ్ఞా పూర్వక ఇతరేషాం। భవప్రత్యయో విదేహ ప్రకృతి లయానామ్" అని మొదటి సమాధి పాదములోని సూత్రము.

ప్రతియొక్క పనికి 1 శ్రద్ధ 2 వీర్యము 3 స్మరణము 4 స్థిరచిత్తత 5 సంయమము ఈ అయిదును ఆవశ్యమని చెప్పబడినది. ఈ యంశమును గ్రహించక, గ్రహించుటకు యత్నమైననూ చేయక, స్వేచ్ఛానువర్తులై మనవారిలో అనేకులు యోగసాధన ఫలము బొందలేకున్నారు ఇందుకు యోగ ప్రచారకులు కూడ కొంతవరకు కారకులని చెప్పినచో తప్పులేదు.

ఇదే రీతిగా "సతుదీర్ఘకాల నైరంతర్య సత్కారాదర సేవితో దృఢభూమిః" అని పాతంజలదర్శన సమాధి పాదములో [illegible]బడిన సూత్రమును శ్రద్ధగా పరిశీలించుట అవసరము. యోగాంగ సాధనల నభ్యసించువారు చాలకాలము ప్రతినిత్యము నియమిత కాలమందు పూజ్యభావముతో, ప్రేమతో అభ్యసించవలెనే గాని ఒకరోజు అభ్యసించి, తరువాత కొన్ని దినములుమాని తిరిగి మొదలుపెట్టి రోగబాధల ననుభవించలేక ఎన్నెన్నియో చికిత్సావిధానములను మార్చుకొనుట నిష్ప్రయోజనము. రేచక పూరకములను, క్రమబద్ధమైన కుంభకమును చేయజాలక తిరిగి మొదటికి వచ్చుటకంటె, సూక్తరీతిగా సదా తన శక్తిని మించక అభ్యసించుట వలననే ఇహపర సుఖములు లభించగలవు.

ఎనిమిది సోపానములుగల యోగ సౌధమును క్రమముగా నెక్కవలెనేగాని త్వరగు మని సోపానములను దాట యత్నించరాదు. ప్రతి సోపానముపైన అడుగు పెట్టినప్పుడెల్ల ఈ యారోహణము పరమాత్మసేవకే నను దృఢనిశ్చయముతో తన సత్కర్మలను పరమాత్మయొక్క పాదారవిందములకే అర్పించుచుండవలెనని "శౌచ, సంతోష, తపః, స్వాధ్యాయ, ఈశ్వర ప్రణిధానాని నియమాః" అని హెచ్చరింపబడినది.

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 178. పరమాణు రచన

పరమాణువు, అది ఏ మూలద్రవ్యానికి చెందినదైనప్పటికీ, అవిభాజ్యమైన దని 60 సంవత్సరాల క్రితంవరకూ శాస్త్రజ్ఞులు భావిస్తూండేవారు ప్రతి పరమాణువుకూడా స్థిరమైనదనీ, అవిభాజ్యమైనదనీ, ఒకమూల ద్రవ్యపరమాణువు మరియొక మూలద్రవ్య పరమాణువుతో భేదించియుంటుందనీ అప్పుడనుకొనేవారు ఒక మూల ద్రవ్యపరమాణువు మరియొక మూలద్రవ్యపరమాణువు భేదించియుండెడిమాట నిజమే. కాని, పరమాణువు అవిభాజ్యముమటుకు కాదని యిటీవలి శాస్త్రజ్ఞులు కనుక్కొన్నారు.

పరమాణువు కంటికి కనిపించనంతటి అత్యల్పమైన కణమైనప్పటికిని దానికి గొప్ప వ్యూహ ముంది. పెద్దపెద్ద దివ్యస్థలాలలో మధ్యను గుడి, ఆ గుడిచుట్టూ భక్తులు ప్రదక్షిణం చెయ్యడానికి ప్రాకారాలూ ఉంటాయి. గుడులలో చిన్నా పెద్దా ఉండవచ్చు; ప్రాకారాల సంఖ్యలోకూడా తేడా ఉండవచ్చు. కాని అన్నింటి నమోనా సమానంగానే ఉంటుంది. పరమాణు వ్యూహంలోకూడా మధ్యను ప్రముఖమైన కేంద్రకం, (*Nucleus*) ఆ కేంద్రకం చుట్టు ఎలక్ట్రాను లనబడే అల్పకణాలు తిరగడానికి కక్ష్యలు ఉంటాయి కేంద్రకం యొక్క ద్రవ్యరాశిలోను, దానిచుట్టూ ఉన్న కక్ష్యల సంఖ్యలోను తేడా లున్నప్పటికీ, అన్ని మూలద్రవ్యపరమాణువుల వ్యూహాలూ ఒకే నమోనాలో ఉంటాయి

హైడ్రోజనితప్ప మిగిలిన మూలద్రవ్యాలలో ఏదైనా ఒకదాని పరమాణువ్యూహాన్ని బద్దలు కొట్టినట్లయితే ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు అను మూడు రకాలకణాలు బయటకు వస్తాయి హైడ్రోజని పరమాణువుల వ్యూహాన్ని బద్దలు కొట్టినప్పుడు న్యూట్రానులు లభ్యం కావు; ఎలక్ట్రానులు, ప్రోటానులు మాత్రమే ప్రత్యక్షమౌతాయి వీటిలో ఎలక్ట్రాను మిక్కిలి తక్కువ ద్రవ్యంగల కణం దానితో పోల్చినపుడు న్యూట్రాను, ప్రోటానుల ద్రవ్యరాసులు చాల ఎక్కువ. ప్రోటాను ద్రవ్యరాశి ఎలక్ట్రాను ద్రవ్యరాశికి 1845 రెట్లుంటుంది న్యూట్రాన్ ద్రవ్యరాశికూడ ఇంచుమించు ప్రోటాన్ ద్రవ్యరాశి అంతే ఉంటుంది ఎలక్ట్రాను ఋణవిద్యుదావేశితమైన కణం ప్రోటాన్ ధనవిద్యుదావేశితము పరిమాణంలో మాత్రం ఎలక్ట్రాన్ ఆవేశం, ప్రోటాన్ ఆవేశం సమానంగా ఉంటాయి. న్యూట్రానుకు విద్యుదావేశం లేదు

పరమాణు వ్యూహంలో ముఖ్యమైనది కేంద్రకం. పరమాణువులో ఉండే న్యూట్రానులు, ప్రోటానులు ఈ కేంద్రకంలోనే ఉంటాయి. పరమాణువుయొక్క మొత్తం పరిమాణంతో పోల్చినపుడు కేంద్రకంయొక్క పరిమాణం చాల తక్కువగా ఉంటుంది. ఈవిధంగా పరమాణువులో ఉండే కణాలలో ఎక్కువ ద్రవ్యంతో కూడియున్న ప్రోటానులు న్యూట్రానులు తక్కువ పరిమాణంగల కేంద్రకంలో గుమికూడియుండడంవలన పరమాణు ద్రవ్యం ఇంచుమించుగా యావత్తు కేంద్రకంలో కేంద్రీకృతమై, పరమాణువులో అదే ఎక్కువ సాంద్రమైన భాగంగా ఏర్పడుచున్నది. ఈ కేంద్రకాన్ని చుట్టియున్న కక్ష్యల వెంబడి ఎలక్ట్రానులు తిరుగుతు ఉంటాయి. పరమాణువులో కేంద్రానికీ ఎలక్ట్రానులకూ మధ్యనున్న ప్రదేశమంతా శూన్యమే.

పరమాణువులో కేంద్రకం ముఖ్యమైన భాగం కావడానికి కారణం అది పరమాణువునకు వ్యక్తిత్వాన్ని సమకూర్చేది అవడమే; అంటే అది ఏ మూలద్రవ్యానికి చెందినదో తెలియజేసేది కావడమే ఒక మనిషిని అతని ముఖాన్నిబట్టి, కన్ను ముక్కు తీరునుబట్టి గుర్తించగలం. కాళ్ళు చేతులుకూడా మనుష్యుని అవయవాలేయైనా, వానినిబట్టి అతనిని గుర్తించడం కష్టసాధ్యం ఇక అవి ఖండింపబడినా అతనిని గుర్తించడంలో కష్టమేమీ ఉండదు. పరమాణువు విషయంలోకూడా పరమాణు కేంద్రకం చుట్టు తిరుగుచున్న ఎలక్ట్రానులు పరమాణువులో భాగమేయైనా వానిలోకొన్ని పైకిపోవడం గాని, లేదా కొన్ని క్రొత్తగావచ్చి వానిని చేరడంగాని తటస్థపడినప్పటికీ ఆ పరమాణు వ్యక్తిత్వం మాత్రం మారదు. పరమాణు కేంద్రకంలో ఉండే ప్రోటానుల సంఖ్య ఆ పరమాణువ్యక్తిత్వాన్ని అంటే అది ఏ మూలద్రవ్యానికి చెందినదో తెలియజేస్తుంది.

వేర్వేరు మూలద్రవ్యాల పరమాణు కేంద్రకాలలో ఉండే న్యూట్రానుల యొక్కయు, ప్రోటానుల యొక్కయు సంఖ్య వ్యత్యాసంగా ఉంటుంది హైడ్రోజని పరమాణు కేంద్రకంలో ఒక్క ప్రోటాను మాత్రమే ఉంటుంది; న్యూట్రానులేమీ అందులోలేవు హీలియం పరమాణు కేంద్రకంలో 2 న్యూట్రానులు, 2 ప్రోటానులుఉంటాయి మామూలు ఉప్పులోఉండే సోడియం పరమాణువులో 12 న్యూట్రానులు, 11 ప్రోటానులు ఉన్నాయి; క్లోరీన్ పరమాణు కేంద్రకంలో 18 న్యూట్రానులు, 17 ప్రోటానులుఉన్నాయి. ప్రకృతిలో సహజంగా లభమయ్యే మూల

---

ఈశ్వరార్పణకేనను బుద్ధితో పనులు చేయువారికి అహంకారము నశించును. తను స్వతంత్రుడు గాడు. పరమాత్మకును ఆయన ఆజ్ఞారూపమైన సచ్ఛాస్త్రమునకును తను అధీనుడని భావించినప్పుడే శాంతి సంస్కారము మనస్సులో దృఢముగా నేర్పడగలవు తనకంటె మించిన అధికారులు లేరని భావించి భ్రమించువారే అహంకారమను మనోధర్మదోషమునకు లోనై, ఆదిలో లబ్ధి పొందినవారైనప్పటికిని క్రమక్రమముగ కష్టముల ననుభవించుచున్నారని మనము ప్రత్యక్షముగా చూచుచున్నాము

అనేక సంవత్సరములుగా సంక్రమించిన రోగములను నివారించుకొనుటకు, బుద్ధిమాంద్యమును నిర్మూలించి కుశాగ్రబుద్ధితో వివేకమునుబొంది దీర్ఘాయుష్యముతో ఆనందించుటకుగాను "తత్ప్రతిషేధార్థం ఏకతత్త్వాభ్యాసః" అని చెప్పినట్లు హితము మితములైన సాత్త్వికాహారమును సేవించుచు జితేంద్రియత్వ, పాతివ్రత్య, సత్య వచనాదులను విధిగా ఆచరించు టవసరము

ఇతర సాధనలవలె కేకలు వేయుచు అల్లరి చేయుట పనికిరాదు మౌన మవసరము.

భారతీయుల దీర్ఘాయువు మొదలగు కొన్ని అమూల్య ధర్మములు అనవసరమగు కొన్ని కార్యములవలనను, అసమయమందు అతిగా ఆహార సేవనము, వాచాలత్వము మొదలగువానివలన నష్టమైనవని వ్రాయక తప్పదు ఇకముందైనను మన సంతానము ఇట్టి ఆపదలకు గురికాకుండ యత్నించుట అవశ్య కర్తవ్యము [సశేషము]



# విజ్ఞాన వీధులు



ద్రవ్యాలలో మిక్కిలి బరువైనదైన యురేనియమ్ పరమాణుకేంద్రకంలో 143 న్యూట్రానులు, 92 ప్రోటానులున్నాయి. ఇటీవల శాస్త్రజ్ఞులు కృత్రిమంగా తయారు చేస్తున్న నెప్ట్యూనియమ్ పరమాణుకేంద్రకంలో 93, ప్లూటోనియం పరమాణు కేంద్రకంలో 94, క్యూరియం పరమాణుకేంద్రకంలో 95, కెలిఫోర్నియా పరమాణు కేంద్రకంలో 96 ప్రోటానులున్నాయి

పరమాణు కేంద్రకాలలో ఉండే న్యూట్రానులు విద్యుదావేశము లేనివి కావడంవలనా, ప్రోటానులు ధన విద్యుదావేశితములు కావడంచేత మొత్తం మీద పరమాణు కేంద్రకం ధనవిద్యుదావేశితమైయుంటుంది. అయితే పరమాణువు సామాన్యంగా తటస్థ స్థితిలోనే ఉంటుంది కాబట్టి ప్రతి పరమాణువులోను కేంద్రకంలో ఎన్ని ప్రోటానులుంటాయో అన్ని ఎలక్ట్రానులు కక్ష్యలలో ఉంటాయి దానినిబట్టి హైడ్రోజని పరమాణువులో ఒకటి, హీలియం పరమాణువులో రెండూ, క్లోరీన్ పరమాణువులో 17, యురేనియమ్ పరమాణువులో 92... ఎలక్ట్రానులుంటాయని గ్రహించవచ్చు. పరమాణువులలో కేంద్రకంచుట్టు ఎలక్ట్రానులు తిరిగే కక్ష్యలు చాల సంకీర్ణంగా ఉంటాయి మాటవరుసకు హైడ్రోజని పరమాణువులో నున్నది ఒకేఒక ఎలక్ట్రాను అయినప్పటికీ, అది తిరిగే మార్గం ఎల్లపుడూ సమానంగా ఉండదు; అది ప్రదక్షిణంచేసే కక్ష్యలు అనేకంగా ఉన్నాయి అయితే అది యేయేమార్గాల తిరుగగలదో శాస్త్రజ్ఞులు సిసలుగా లెక్కకట్టారు. కాని మనము లోతుకు వెళ్ళకుండా, హైడ్రోజని పరమాణువులోనున్న ఎలక్ట్రాను కక్ష్యకేంద్రకాన్ని చుట్టియున్న దీర్ఘవృత్తమైయుంటుందని చిత్రించుకొనవచ్చు.

"అనంత్"

## చిత్రప్రశ్నలకు జవాబులు

—ఏజాతి 'ప్రొద్దుతిరుగుడు' పూవు లేనా సరే, ఎప్పుడూ పొద్దువైపే తిరిగి ఉంటాయన్నమాట నిజముకాదు తొందరపడక దాఖలా చూడండి.

—అవును 28-12-53 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో విజ్ఞానవీధులు, 27 పుటలో సగానికిపైన బొద్దు అచ్చులాగా క్రిందివైపు వాడిగా చక్కని అక్షరాలతోనూ అచ్చు అయినట్టు కనిపిస్తోంది. దానికి కారణము అచ్చుల తప్పుకాదు అచ్చులన్నీ క్రిందివైపున్న అక్షరాలలాంటివే అయితే పై అక్షరాలు బొద్దుగా ఎందుకయినవి? అని అడిగితే, ఆ పేజీకి వెనకవైపు చూడండి అంటాను బొమ్మ బ్లాకుఉంది. ఈ బ్లాకు అచ్చువేసిన తర్వాత 27 వ పేజీ అక్షరాలు అచ్చయాయి. వెనకవైపు అచ్చువల్ల కాగితానికి 'చమురు' కొంచెం అంటింది. ఆ తడి పూర్తిగా ఆరకుండానే 27 వ పుట అచ్చువేశారు. కొంచం తడిగా ఉన్న కాగితముమీద అచ్చువేస్తే ఈ అక్షరాల చమురు కొంచెం పాకుతుంది ఇటూ అటూ. అక్షరాలు బొద్దుగా ఉన్నట్లు కనపడడానికి ఇదే కారణము. కాలక్షేపం మొదటి పుటకూడా బొమ్మ బ్లాకుకి వెనకవైపునే ఉన్నది. కనకనే ఆ అక్షరాలూ బొద్దుగా కనపడుతున్నాయి.

—గ్లిసరీనులో ఉదజనీ, కర్బనమూ కలవు. ఇవి రెండూ మండగల పదార్థాలే.

—విజ్ఞానశాస్త్రము నమ్మకాలమీదకాక పరిశోధన, అవలోకనములవల్ల గ్రహించిన విషయాలపై నాధారపడును. 'ఆత్మ', 'భగవంతుడు, నరకము, స్వర్గము విజ్ఞానశాస్త్ర వీధులలో యింకా గోచరించలేదు. మనకు తెలియని విషయాలనుగురించి తెలుసుకో గలిగినవరకూ ఏమీ చెప్పకపోడము మంచిదని విజ్ఞానశాస్త్రపు దృష్టి మతము అంటే నమ్మకము. దానికి సోదా చూడడములో ఆసక్తి లేదు నమ్మిన తర్వాత సోదా చూడడము దేనికి? భగవంతుడు భూమిని సృష్టించిన తర్వాతనే సూర్యుణ్ణి సృష్టించాడని బైబిలు వాక్యము భూమిని ఆదిశేషుడో మరి యెవరో మోస్తున్నారని మన పురాణాల వాక్యము ఈ నమ్మకాలు లేనివారిని నాస్తికులన్నారు నాటివారు. నేడు ఈ నమ్మకాలు పోయినవి. కనక నమ్మకాలు పరమసత్యము కావని శాస్త్రజ్ఞుల వాదము. 'మీ శాస్త్రవాదములు మారిపోవుటలేదా?' అని ఎదురు సవాలు వేస్తే "క్రొత్త సాక్ష్యము దొరికినందువల్ల మారుతున్నాయిగాని నమ్మకాలవలె అసలే రూపుమాసిపోవడము లేదే" అని జవాబు నమ్మకాలికి ప్రయోగ సాక్ష్యము లేదు విజ్ఞానశాస్త్రమంతా ప్రయోగసాక్ష్యముమీదనే ఆధారపడుతుంది

—ఏ పదార్థములోని పరమాణువులైనా కదులుతూంటాయి నిజమే అయితే ఈ కదలిక అతిసూక్ష్మము గుంజలకి కట్టిన పశువులు ఆ గుంజచుట్టూరానే తిరుగుతూన్నట్టు ద్రవ్యాలలోని పరమాణువులు తమ స్థావరానికిటూ అటూ కొద్దిపాటి దూరమే కంపిస్తాయి పరమాణువులకుగల చేరిక ఆ పరమాణువులను దూరంగా తప్పుకుపోనివ్వదు. పరమాణువులన్నీ అన్ని దిక్కులలోనూ కంపించుతూండడమువల్ల వస్తువు మొత్తంగా కంపించదు ఏ పదార్థములోనైనా పరమాణువులన్నీ ఒకేరీతిగా కంపిస్తేగాని వస్తువు మొత్తానికి కంపముగాని కదలికగాని ఉండదు.

మైదానములోఉన్న జనసమ్మర్దములో వ్యక్తులు కదులుతూన్నప్పటికీ, మొత్తపు సమ్మర్దము కదలదు సిపాయిలవలె జట్టు జట్టంతా ఒకేవైపు కదిలినప్పుడు కదలిక కలిగినట్టు కనబడుతుంది

ద్రవ్యాలలోని పరమాణువులకు ఈరకపు కదలిక లేదు అందుకని అణువులు కదిలినా వస్తువు మొత్తము కదలదు సూర్యప్రకాశము గారూ.

—సూర్యబింబము ఎప్పుడూ ఒకే వేడి కలిగిఉంటుంది. అయితే ఉదయాస్తమయాల్లో సూర్యుని కిరణాలు భూమిమీద వాలుగా పడతాయి అంటే అవి ఎక్కువ మేరని వెచ్చబెట్టాలి కనక ఉదయాస్తమయ సూర్యకిరణాలు వేడిగా ఉన్నట్టు కనబడవు.



# ★ దేవీ ప్రసన్నం ★

(43-వ పేజీ తరువాయి)

...రు. పిల్ల లందరూ మాష్టార్ని ...సరించారు.

మాష్టారు క్షణం కన్నుమూసి, తెరచి, ఏదో కనిపెట్టినవాడికి మల్లే చిటిక వేసి - "అరేయ్ యీ పెట్టెల్లో ఓ పెట్టెకి ప్రక్కన చాక్ పీస్‌తో యింటూమార్కు పెట్టి వుంటుంది. ఆపెట్టెని కాస్తా యిలా తేండి, చెబుతాను" అని అంటూ ఆతిథీమాగా అక్కడున్న యీజీ చేర్లో కూలబడ్డారు పిల్లలు ఒక్కొక్కటిగా యింటూ మార్కులున్న పెట్టెలన్నీ, అంటే అక్కడున్న అన్ని పెట్టెలూ తెచ్చి మాష్టారు ముందు పడేశారు.

మాష్టారుకి యిదేమీ అర్థం కాలేదు.

"ఇంటూమార్కున్న పెట్టెని ...మ్మంటే అన్ని పెట్టెలూ తెచ్చి నా ముందు పడేశా రెందుకర్రా" అని దీర్ఘం తీశారు.

"అన్నిటికీ వున్నాయండీ! ఇంటూ మార్కులు" అని పిల్లలు జవాబు చెప్పగా మాష్టారు ఆశ్చర్యపడ ...ండా వుండలేకపోయారు.

స్వయంగా పెట్టెలన్నీ పరీక్షించి- ఇదేవిటి? పెట్టెలన్నిటికీ యెక్కడివీ ఫర్తులు?" అని ముక్కు మీద వేలేసుకున్నారు.

బహుశా, "ఆలీబాబా నలభై ...ంగల" కథ జ్ఞాపకానికి వొచ్చి ...ంటుంది. మాష్టారి ముఖంలో అప్పటికప్పుడే కళలు మారినై

...లో యింతటివాళ్లుంటారని ...నెన్నడూ అనుకోలేదురా నిన్న నాపర్సు కాజేసిన మహానుభావుడెవడో కాస్త కనికరించి పర్సు యిచ్చేస్తే సంతోషిస్తాను." అని అర్థించగానే, ఓమూలనించి— "అదేవిటండీ పూజలో కూచుంటే దేవీప్రసన్నమై దొంగని యిట్టే పట్టిచ్చేస్తుందికదా" అని జవాబు వినిపించింది. పాపం, మాష్టారికీ జవాబు ముల్లులా గుచ్చుకుని వుంటుంది.

"బాగానేవుంది. ఇల్లు గాలి యేడుస్తోంటే, చుట్టకి నిప్పడిగాడంట యెవడో అలావుంది పర్సుపోగొట్టుకుని యేడుస్తోంటే దేవీటదేవీ—" అని బరువుగా నిట్టూర్చారు.

ఇంతలో ఆకుర్రాడు ముందుకొచ్చి--"అదేవిటండీ మాష్టారు. అలా దిగులుపడతారు? కాస్త ఆగండి, ఆదొంగెవడో క్షణంలో పట్టిస్తాను"అని, నావేపుచూచి,— "చెప్పంర్రా చెప్పండి. చెప్పకపోతే అనవసరంగా పరువు పోగొట్టుకుంటారు. నామాట వినండి!" అని, అడిగాడు.

ఎవరూ పలకలేదు నాగుండెల్లో గుర్రాలు పరుగెడుతున్నయ్.

"అయితే వుంతండి!" అని, క్షణం కళ్లుమూసి,—"ఆఁ తెలిసింది. అరేయ్, ఆపెట్టె తెరిచిచూడండ్రా" అని, నాపెట్టెవేపు చూపాడు మహా కనిపెట్టినవాడికిమల్లే.

రాత్రి ఆపనిచేసిన ప్రబుద్ధుడితగాడేనేమో!

నాకు భయమేసింది, యేం జరుగుతుందో, యేమోనని. ఇంతలో నాపెట్టెని సోదా చెయ్యడం, కనిపించకపోయేసరికి యీ కొత్త మంత్రగాడి మాటకూడా ఖాళీ కావడం జరిగింది.

పాపం, ఆ కుర్రాడు ఆశ్చర్యంతో నుంచున్నవాడు, నుంచున్నట్టే వుండిపోయాడు.

పిల్లలు అన్నిపెట్టెలూ గాలించేశారు. యెక్కడా చిక్కలేదు

"అదేవిటండి, మాష్టారు? రాత్రి మీరు పర్సు పెట్టెమీదపెట్టి మరిచిపోతే మిమ్మల్ని గమ్మత్తుచేద్దామని నేనేనండీ, ఆ పర్సుని తీసి వాడి పెట్టెలో పడేశాను ఇంతలో యెలా మాయమైందో ఆశ్చర్యంగా వుందండి!" అని కుర్రాడంటోంటే -

"అవున్రా అబ్బీ! నీవు తీసి, పెట్టెలోవేస్తోంటే నేనూ చూచాను. నిన్ను గమ్మత్తు చెయ్యాలని నీకు తెలీకండా ఆ పెట్టెని కాస్తా గుర్తు పెట్టుకువెళ్ళి పడుకున్నాను. తెల్లవారేసరికి, పెట్టెలన్నింటికీ గుర్తులుండడం, పర్సు కాస్తా మాయమవడం, ఆశ్చర్యంగానే వుంది" అని, మాష్టారు అందుకున్నారు.

నాకు నవ్వాగింది కాదు. కాని నవ్వితే కథ రక్తి కట్టదు. అంచేత, యెలాగో అతి ప్రయత్నంమీద ఆపుకున్నాను

"అదేవిటండీ! అంత అర్ధరాత్రప్పుడు అతడు మీపర్సు తియ్యడం యేవిటి? - నా పెట్టెలో వెయ్యడం మేవిటి? - మీరు చూడడమేవిటి?- ఇదంతా నిజమే అయితే పర్సు యింతలోకే యెలా మాయమవుతుంది? మీరేదో కలగన్నారల్లే వుంది. మీరే మరిచి యెక్కడేనా పెట్టివుంటారు. మీ పెట్టెలన్నీ

# కుర్చీతో కూనిరాగం

(8-వ పేజీ తరువాయి)

కొన్నూవచ్చు, రెట్టూవచ్చు. ఆడపిల్లలని అగౌరవించే రచనలని మట్టుకూ నేను మెచ్చుకోలేను,

"ఇకనుంచి 'కూనిరాగం'లో అశస్య శాలు పడకుండా ముందుకు సాగిపోతుం దని ఆశిస్తున్నాను" అని రాధాకృష్ణమూర్తి గారు, ఆశించినందుకు కృతజ్ఞుణ్ణి, అపస్వరాలూ, 'అపశ్రుతులు' రాకుండా ఉండా అని ప్రయత్నిస్తాం

కాకాకలం "ఇవాళ పోస్టు లో నే వచ్చింది" అని వారపత్రిక సంపాదకులు 'శ్రీ రోహిణేయ' అనేవారు "శ్రీ ఆరుద్ర గారి కూనిరాగాలాపనలో అపశ్రుతి" అనే వ్యాసాన్ని అందచేశారు 'శ్రీ రోహిణేయ' గారు వారి పూర్తి నామాన్ని చిరునామాని వ్రాయకపోయినా సర్కారువారి పోస్టు ముద్రమట్టుకు వదరువ్యాసం తో హైస్కూలు ఉన్న ఊరిలో నే పోస్టు చేసినట్టు తెలుస్తున్నది ఆ ఊరివారే కాకినాడ చేతకబోలు వారు. ఆ హైస్కూలు పత్రికని కూలంకషంగా చదివినట్టుకూడా వారి వ్యాసంలో విదర్శనాలు కనబడుతున్నవి

'శ్రీ రోహిణేయ' గారు ముద్రణలో జరిగిన ప్రమాదంవల్ల నేను ఉదహరించిన విద్యార్థి పద్యంలో ఏర్పడిన పొరపాట్లు చూపారు అందుకు కృతజ్ఞుణ్ణి అచ్చు తప్పుపడ్డందుకు విచారిస్తున్నాను (అచ్చు తప్పుకి మేము కూడా విచారిస్తున్నాం - సంపాదకుడు)

"ఇటువంటివాళ్లు మాత్రం కాదు లేడీస్ వాళ్లు కేవలం కేడీస్"

అని ఉండవలసిన పంక్తులలో "కాదు" అనే మాట అచ్చులో ఎగిరిపోయింది ఈ లోపాన్ని చూపెట్టి 'శ్రీ రోహిణేయ' గారు ఇలా వ్రాస్తున్నారు

" ప్రతి శీర్షికకూ మకుటంగా నీతి అనేది ఉండాలి విద్యార్థి ఆడపిల్లల మన స్తత్వాన్ని అంత ధైర్యంగా వర్ణించివా, (అంటే కేవలం వాళ్లమీద దండె త్తడం తప్పే అనాలి) చివరకి తన ఉద్దేశంలో - పైని చెప్పినటువంటి ఆడవాళ్ళు మాత్రం లేడీస్ కాదని వాళ్లు కేడీస్ అని - అట్లా వుండటానికి ప్రయత్నించవద్దనీ ఏదో తోచిన సలహా ఇస్తాడు "

ఇది హాలీవుడ్ చిత్రాల పద్ధతిలో ఉంది చిత్రం పొడుగునా దొంగల నాయకులు, హంతకులు చేసే ఘోరాలని వివరంగా చిత్రించి, వాళ్ళని అమరవీరుల మాదిరిగా చూపించి కొసనిమట్టుకూ "క్రైమ్ డజ్ నాట్ పే" అంటే "నేరం లాభసాటి కాదు" అని హాలీవుడ్ చిత్రాలు ప్రబోధం చేస్తాయి అదేవిధంగా ఆడపిల్లలు చెడ్డవాళ్ళని పాతిక పాదాలు పైగా రాసి వీళ్లు 'లేడీస్' కారు అని చెప్తే సరిపోతుందా? 'శ్రీ రోహిణేయ' గారు సరిపెట్టుకోమన్నా నేను సరిపెట్టుకో లేను

"అసలు పాఠశాలపత్రికలు రసపుష్టిమై ఉండాలంటే కేవల విద్యార్థులరచనలేగాక ఉపాధ్యాయ పండిత వర్గాలవారివి కూడా వుండాలని చాలామంది నమ్మకం. మొదట్లోగా వున్న 'శుభోదయం' అనే శీర్షికలోని సంస్కృత శ్లోకాల భావాన్ని కొద్దిగానో గొప్పగానో చదివి అర్థం చేసుకొనేవారికి ఈ చాటువులంత అర్థంకాని పరిస్థితిలో, ఉపాధ్యాయులే అర్థం చెప్పాల్సినంత అవస్థలో ఉన్నాయంటే అంత గా నమ్మ లేకుండా ఉన్నాను విశిష్య భాషాప్రవీణులు విద్యాప్రవీణులు ప్రధానాంధ్ర పండితులు అయిన వారి చాటువులు వారికి తగినట్లుగానే పాండితీ గరిమతో ఒప్పుతయి గాని తదప్రవీణులు అపండితులు అయిన వారికి తలనొప్పిగానూ వుండవచ్చు సినిమా కవిత్వంవలె సర్వజన సామాన్యమైందిగా వుండకపోనూవచ్చు దాని కవరేం చేస్తారు కష్టే ఫలీ" అనీ కూడా 'శ్రీ రోహిణేయ' గారు వ్రాశారు

నేను ఈవారం కూనిరాగంలో మొదట మనవిచేసినట్టు కళాశాల పత్రికలలో అధ్యాపకులు కూడా రచనలు చెయ్యాలి గాని ఔచిత్యం మట్టుకూ అవసరం అదీ నా విజ్ఞాపన 'శ్రీ రోహిణేయ' ... కంలో ఆ హైస్కూలు ... సంస్కృత శ్లోకాలూ, చాటువు విద్యార్థులకి సులభంగా బోధపడ ఉన్నవి అనే అర్థం స్ఫురిస్తున్న తెలుగు పద్యాలకి అర్థం ఉపాధ్యా చెప్పవలసినంత అవస్థ లేదంటున్నా. విద్యార్థులందరికి అంత కావ్యపరి[జ్ఞానం] ఉంటే నేననుకొన్నంత ప్రమాదం దన్నమాటే!! ఆ చాటువులలోని విద్యార్థులకి బోధపడితే 'అమంగళ[మ్] ప్రతి హతమగుగాక !'

ఆ ఉన్నతపాఠశాలపత్రికలోని రసం ఎంత ఉన్నతంగా ఉన్నా చూశాక "శ్రీ ఆరుద్రగారు సుండేలు కొనేఅంత పరిస్థితి ఏర్పడ్డందుకు ఆశ్చర్యం విచారమూ కలిగినవి" 'శ్రీ రోహిణేయ' గారు అంటున్నా[రు] చెయ్యమన్నారు చెప్పండి అన్ జరుగుతున్నప్పుడు సుండేలు ... కుండా ఉండలేను ఆ రచనలు ప[ద్ధ] పాఠశాల పత్రిక కాకపోతే నాకు ఇంత ఆశ్చర్యం విచారం కలిగి ఉండే కావు

"విమర్శించాలంటే సాహితీ ... కాదు ఏ రంగంలోనైనా ఏదో ... దొరక్కపోవు కాని ఆ విమర్శ సార్థ[క] మవ్వంగావుంటేనే సురభి కుసుమ[మై] హృదయాల్ని ఆకర్షిస్తుంది లేకపో[తే] లేని గడ్డిపూవే అంటూ ఇంకటితో [ము]గిస్తా"అని శ్రీరోహిణేయ గారు ... [ము]న్న ముగించారు ! నిజమే ... ఉండాలనే విమర్శించాను ... చదివి ఇకమీదటైనా విద్యార్థులు ... రచనలు చేస్తే అధ్యాపకులు వాటిని ... మెచ్చుకొన్నా, వాటివిషయాన్ని ... విద్యార్థులని మంచిమార్గంలో పె[ట్టాలని] ఆశించాను. తమ 'పాండితీగరిమ[తో] ఒప్పే' శుద్ధశృంగార రసమయపద్యాలు ... శాల పత్రికలో ప్రచురించరని ... తున్నాను

'శ్రీ రోహిణేయ' గారు ఆ ఊరు ... కాబట్టి దయచేసి నా తరఫున ఆ విద్యా[ర్థికి] ఆ ప్రధానాంధ్ర పండితుడికి ఈ ... చెప్పి నా విమర్శని సార్థకం చే[స్తారని ఆశిస్] తున్నా

[శ్రీ యడవల్లి రాధాకృష్ణమూర్తి పంపిన "కూనిరాగ ప్రతిరాగం" వ్యాసాన్ని, 'శ్రీ రోహిణేయ' గారు "ఆరుద్రగారి కూనిరాగాలాపనలో శ్రుతి" అన్న వ్యాసాన్ని స్థలాభా[వం వల్ల] ముద్రించలేదు వానిలోని ముఖ్య ... లను ఆరుద్రగారు ఈవారం 'కూనిరాగ[ం'లో] ఉదహరించారు —సంపాదక[ుడు]

గాలించండి!"అని అందుకున్నాను

"అదేవిట్రా నన్ను ఫూల్ని చేస్తున్నావ్ ? నే కన్నది కల గాదురా నాయనా—నిజమే పర్సు వాడిచేతిలోంచి జారిపడితే చప్పుడుకి మెలకువొచ్చింది. వాడు తీసిందీ నిజమే—నేను చూచిందీ నిజమే" అని, నిట్టూర్చారు మాష్టారు

ఇలా అంటుండగానే పిల్లలు మాష్టారిపెట్టెలు అన్నీ గాలించి, అడుగుపెట్టెలో నున్న పర్సుని బయటికి తీశారు

పర్సుని చూడగానే మాష్టారూ, శాస్త్రి ఆ ఘనకార్యం చేసిన ప్రబుద్ధుడూ, యిద్దరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు.

"బహుశా, యిదంతా దేవీ మహిమ అయివుంటుంది" అన్నీ, ఫక్కున నవ్వేశాను ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Ma[dras]